# ఆంధ్రపత్రిక

317615




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 256 MONDAY 19th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# కాశ్మీర్ సమస్యపై పరిష్కారసాధన: మండలి అధ్యక్షునికి అధికారం

## "ఆహార స్వయం సమృద్ధికి రైతుల తీవ్రకృషి అవసరం"

### అఖిలభారతకిసాన్ కాంగ్రెస్ సమావేశంలో ప్రధాని నెహ్రూ ఉద్బోధ

న్యూఢిల్లీ, డిసెంబరు 17: ప్రధానమంత్రి పండిత నెహ్రూ ఈవేళ సాయంత్రం ఇక్కడ అఖిలభారత కిసాన్ కాంగ్రెసులో మాట్లాడుతూ, ప్రజలందరు ఆహారోత్పత్తికి అధికంగా కృషిచెయ్యాలనీ అందులోను రైతులు ఈ విషయంలో గట్టిగా నడుములు బిగించాలనీ, భారత దేశాన్ని దృఢతరంగాను, ఐశ్వర్యవంతంగాను, చెయ్యాలనీ ఉద్బోధించారు.

పండిత నెహ్రూ ఇల్లాగ ఉపన్యసించారు. "ఒకదేశం ఐశ్వర్యం వెండి బంగారాలను బట్టి నోట్లను బట్టి నిర్ణయించడానికి వీలులేదు. అన్న వస్త్ర సమృద్ధిని బట్టి మిగిలిన వస్తువుల సమృద్ధిని బట్టి, వీటి ఉత్పత్తిని బట్టి ఒకదేశ భాగ్యం నిర్ణయించబడుతుంది. ఇప్పుడు మనకు ఆహారం ఒక ప్రధాన సమస్య అయింది. భారత ప్రభుత్వం 1951 ఆఖరునించి పై దేశాల నించి ఆహారం దిగుమతి చేసుకో కూడదని దృఢ నిశ్చయం వహించింది."

ఆ పిమ్మట దేశంలో కల్లోల పరిస్థితులు కలిగించే వారిని ఉద్దేశించి పండిత నెహ్రూ ఇల్లాగ అన్నారు:—"ప్రభుత్వ ప్రాతినిధ్యానికిగాని, విమర్శనలకు గాని నేను అభ్యంతరపెట్టను. దేశంలో కల్లోల పరిస్థితులు కలిగిస్తే బాధపడేవారు ప్రజలేనని అందరూ గ్రహించాలి. కల్లోల పరిస్థితుల వల్ల మన స్వాతంత్ర్యానికికూడా అపాయం కలుగుతుంది.

మన దేశంలో ఎంతో విస్తీర్ణమయిన భూభాగంలో వ్యవసాయం సాగుతున్నది. అయినా మనకు కావలసినంత పంటకూడా మనం పండించుకోలేక పోతున్నాము. ఇది చాలా ఆశ్చర్యకరమయిన విషయము. బాగా ఎక్కువ ఖరీదులు పెట్టి పై దేశాల నుంచి మనం ఆహారం దిగుమతి చేసుకుంటున్నాము. దీనివల్ల భారత దేశైశ్వర్యమంతా పరదేశాలకు పోవడము, తద్వారా సామాన్య పౌరులకు దారిద్ర్యము సంభవిస్తున్నాయి.

మనం ప్రజా సామాన్యం జీవన ప్రమా

2-వ పేజి చూడుడు

### క్రొత్తవోటర్ల పట్టికల నిర్మాణ వ్యయము కేంద్రప్రభుత్వము సగము భరించును

న్యూఢిల్లీ, డిసెంబరు 17: నూతన రాజ్యాంగ విధానమునను సరించి వోటర్ల పట్టీలు తయారుచేయుటకు రాష్ట్రీయ ప్రభుత్వములు, సంస్థానములు చేయు ఖర్చులో కేంద్రప్రభుత్వమువారు సగము భరించనున్నారు. ఇందుకై వారు ఒక కోటి రూపాయలు కేటాయించెదరని తెలియుచున్నది.

## భారతప్రధానితో బర్మా విదేశాంగమంత్రి చర్చ

### త్వరలో ఉభయరాజ్యాల ప్రధానులు సమావేశమయే అవకాశం

న్యూఢిల్లీ, డిసెంబర్ 17: బర్మా విదేశాంగమంత్రి ఈ. ఇమాంగ్ నేటి మధ్యాహ్నం భారతప్రధాని నెహ్రూతో ఒక గంటకు పైగా సంప్రదింపులు జరిపాడు. మాంగ్ ఈవేళ మధ్యాహ్నమే కలకత్తా నుంచి ఇక్కడికి వచ్చాడు. వచ్చినవెంటనే పండిత నెహ్రూను కలుసుకున్నాడు.

ఉభయ దేశాలకు పరస్పరం సంబంధించిన అనేక అంశాలనుగురించి వీరు చర్చించారనీ, కమ్యూనిస్టు చైనా పరిగణన విషయాన్నికూడా చర్చించి ఉంటారనీ తెలుస్తున్నది. ఈ సంప్రదింపులు రేపు పొద్దునకూడా జరగ్గలవని భావించబడుతున్నది. ఈ సంప్రదింపులవల్ల త్వరలో ఇండియా, బర్మాల ప్రధానులు సమావేశమయే అవకాశం ఉన్నదని మాంగ్ ఇంతకుముందే సూచించాడు. నేటిరాత్రి పండిత నెహ్రూ ఈయనకు ఒక విందుచేస్తున్నాడు. బర్మా రాయబారి సర్ మాంగ్ వేకూడా విందులో పాల్గొంటాడు.

మాంగ్ రేపు భారత మహాబోధి సంఘాధ్యక్షుడు డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీని కలుసుకుని, ఆ సంఘం దగ్గర ఉన్న బుద్ధదేవుని అస్థికలలో కొన్నిటిని సంపాదించటానికి ప్రయత్నిస్తాడు. ఈయన ఇక్కడ రెండురోజులుంటారని తెలుస్తున్నది.

### బుందేల్ ఖండ్ భవిష్యత్తు

ఝాన్సీ, డిసెంబరు 17: బుందేల్ ఖండ్ సంస్థానాధీశ్వరులను కలిసికొని మాట్లాడుటకై భారతప్రభుత్వ సంస్థాన శాఖ కార్యదర్శి శ్రీ వి. పి. మీనన్, సంయుక్త కార్యదర్శి ఎస్. ఎమ్. బచ్ గారలు నేడు నౌగాంగ్ కు వచ్చుచున్నారని రేవానుండి యిచ్చటికి వార్తవచ్చినది. బుందేల్ ఖండ్ భాగల్ ఖండ్లలో కొన్ని ప్రాంతములను పరిసర సం॥ రా॥ ములు, మ॥ రా॥ ములలో కలిపివేయు విషయమై సంస్థానశాఖవారు గావించిన తాత్కాలిక సూచనలను విచారించుటకు బుందేల్ ఖండు సంస్థానాధీశ్వరులు నవగాంగ్ లో సభచేయుచున్నారు.

## నార్వేజియన్ ప్రతినిధి ప్రతిపాదనకు ఆమోదం

### ఉభయపక్షాలతో సంప్రతింపులు జరుపవలెనని ఆదేశం

### కమిషన్ కార్యక్రమ వైఫల్యానికి హేతువులు: జెక్ సభ్యుని ప్రత్యేక నివేదిక

లేక్ సక్సెస్, డిసెంబరు 17: ఇండియా పాకిస్థాన్ లను చేరదీసి, కాశ్మీర్ విషయంలో ఈ రెండు దేశాలకు తృప్తికరంగావుండే పరిష్కారమార్గాన్ని సమాలోచించగల అధికారాన్ని భద్రతా సంఘం నేడు అధ్యక్షుడు జనరల్ ఆండ్రూ మేక్ నాటన్ పరంచేస్తూ ఒక నిర్ణయం చేసింది.

కాశ్మీర్ కమిషన్ అధ్యక్షుడు తమ రిపోర్టును భద్రతామండలికి సమర్పించిన అనంతరం నార్వే ప్రతినిధి డా॥ ఆర్నెసుండే పై విధమైన ఒక సూచన చేశారు.

భద్రతాసంఘంలో కాశ్మీర్ మీద చర్చకు పూనుకోగానే ఇండియా - పాకిస్థాన్ ప్రతినిధివర్గాలను సంఘంవారు ఆహ్వానించారు.

ఇండియా ప్రతినిధివర్గానికి సర్ బాజ్ పాయ్ నాయకత్వం వహించారు. ఇందులో కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా కూడా వున్నారు.

పాకిస్థాన్ ప్రతినిధివర్గానికి సర్ జఫ్రుల్లా నాయకత్వం వహించారు.

కాశ్మీర్ కమిషన్ అధ్యక్షుడు సేనార్ హెర్నాండో సాంపర్ రిపోర్టును సంఘం వారికి నివేదించడంతో చర్చ ప్రారంభమైనది.

కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి తాము చేసినకృషినంతా ఈ సందర్భంలో సేనార్ శాంపర్ వివరించారు. యుద్ధవిరామ సమాధానాన్ని గౌరవించినందుకు ఇండియా పాకిస్థాన్ లను రెండింటిని అభినందిస్తూ ఇండియా పాకిస్థానులు రెండు ఈ సమాధానాన్ని పాటించినందుకు మేము వారిని ఎంతో హర్షించాం. నిజానికి వారి కృషి వల్లనే యుద్ధవిరామ సరిహద్దుకూడా ఏర్పాటు చేయడానికి సాధ్యమైనది. అని అన్నారు.

పోతే ఇక కాశ్మీర్ సమస్యా పరిష్కార విషయంలో తమ మధ్యవర్తిత్వం ఏ కారణంచేత దెబ్బతిన్నది వివరిస్తూ తిరిగి ఆ సమస్య భద్రతాసంఘం ముందుకు తీసుకు రావలసిన అవసరం ఎందుకు కల్గిందో ఆయన తెలియజెప్పారు. ఇక ఇప్పుడు భద్రతాసంఘం తాము తమ రిపోర్టులో సూచించినవిధంగా కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి పూనుకోగలదనికూడా ఆయన ఆశిస్తున్నట్లు ఈ సందర్భంలో వెల్లడించారు.

(2-వ పేజీ చూడుడు)

## రాష్ట్రకాంగ్రెస్ చర్యలపై విచారణ జరుపవలసినదని అఖిలభారత కాంగ్రెస్ కు పశ్చిమగోదావరి కాంగ్రెస్ విన్నపం

తాడేపల్లిగూడెం, డిసెం॥ 17: కాంగ్రెస్ సంఘ విషయాలలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధిష్ఠాన వర్గముచేసిన అవకతవకలను, అక్రమాలనుగురించి విచారణ జరుపవలసిందని అఖిలభారతకాంగ్రెస్ ను కోరుతూ నిన్న శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు (ఎం. ఎల్. ఎ) గారి అధ్యక్షతను కేశవరం గ్రామంలో జరిగిన పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెస్ సర్వసభ్య సమావేశంలో తీర్మానంచేశారు. ఈ తీర్మానంపై దాదాపు రెండు గంటలకుపైగా చర్చజరిగి చివరకు మెజారిటీతో ఆమోదించబడింది. సమావేశానికి 128 మంది సభ్యులు హాజరయ్యారు.

జిల్లా కాంగ్రెస్ మాజీ కార్యదర్శి పోడూరి పేర్రాజుగారిని కాంగ్రెస్ నుండి రెండు సంవత్సరాలపాటు తొలగించవలసిందని సిఫార్సుచేస్తూ ఒక తీర్మానం చెయ్యబడింది. ఈ తీర్మానంపై దాదాపు రెండు గంటలసేపు తీవ్ర చర్చ జరిగి చివరకు మూడింట రెండువంతులు మెజారిటీతో ఆమోదించబడింది.

జిల్లా కాంగ్రెస్ మాజీ అధ్యక్షులు కొమ్మారెడ్డి సూర్యనారాయణ గారు ముందుగా అప్పటి జిల్లా కాంగ్రెస్ సంఘ అనుమతి పొందకుండా, దాదాపు 36 వేల రూపాయలను ఖర్చుచేసినందుకు వారి చర్యను ఖండిస్తూ, యీ లెక్కలను సక్రమంగా ఆడిటు చేయించుటకు, ధన దుర్వినియోగానికి బాధ్యులైనవారి నుండి దానిని రాబట్టుటకు తగు చర్యలను తీసుకోవలసిందని రాష్ట్ర కాంగ్రెస్ ను, అఖిల భారత కాంగ్రెసును కోరుతూ వేరొక తీర్మానం చేశారు. జిల్లా కాంగ్రెస్ కార్యాలయ మాజీ కార్యదర్శి వెంకటరమణమూర్తి తన స్వంతంకోసం ఖర్చు చేసుకొన్న కాంగ్రెస్ ధనమును అతని నుండి రాబట్టుటకు జిల్లాకాంగ్రెస్ అధ్యక్షునకు అధికారమిస్తూ ఇంకొక తీర్మానం చేశారు.

ప్రథమంలో దేశభక్త కొండా వెంకటప్పయ్యగారికి సంతాపం తెలియజేశారు, ఇటీవలవచ్చిన తుపానులో అమితంగా నష్టపడిన బాధితులపట్ల సానుభూతి వెల్లడించారు. (స్వ. వి.)

### డా॥ సుబ్బరాయన్ 23 వ తేదీ జోగ్జకర్తా ప్రయాణం

న్యూఢిల్లీ, డిసెంబర్ 18: ఇండొనీసియాలో భారతప్రతినిధి హోదాను కాన్సల్ జనరల్ నుండి రాయబారి హోదాకు పెంచుటకు భారతప్రభుత్వం నిశ్చయించింది. ప్రథమ భారతరాయబారిగా డా॥ పి. సుబ్బరాయన్ గారు నియమించబడ్డారు.

సంయుక్త ఇండొనీషియా రిపబ్లిక్ అవతరణోత్సవాల్లో పాల్గొనటానికి వీలుగా ఈయన ఈ నెల 23 వ తేదీన ఇండొనీసియాకు బయలుదేరవచ్చునని భావించబడుతున్నది. కేంద్ర-వార మంత్రి రాజకుమారి అమృతకౌర్ కూడా ఆ ఉత్సవాల్లో పాల్గొనే నిమిత్తం అప్పుడే బయలుదేరవచ్చునని తెలుస్తున్నది.

## ఐక్య ఇండొనీషియా ప్రథమ అధ్యక్షుడుగా డా॥ సొకర్నో పదవీ స్వీకారం

జోగ్జకర్తా, డిసెంబరు 17: సంయుక్త ఇండొనీసియా తొలి అధ్యక్షుడుగా డా॥ సుకర్నో నేడు ప్రతిష్ఠించబడ్డాడు. జోగ్జకర్తా సుల్తాన్ భవనంలోని దర్బార్ హాల్ లో ఈ ప్రతిష్ఠాపనోత్సవం జరిగింది. పదవీ స్వీకరణ ప్రమాణాన్ని డాక్టరు సుకర్నో తీసుకునేముందుగా సభికులంతా లేచినిలబడి స్వాతంత్ర్యయుద్ధంలో రాలిపోయిన వీరుల గౌరవార్థం రెండు నిమిషాలు మౌనంగా ఉన్నారు.

కొరాన్ నుంచి ప్రార్థన గీతాలను చదివిన తరువాత ఇండొనీసియా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి డా॥ కుసుమాత్మజ డా॥ సుకర్నో చేత పదవీస్వీకార ప్రమాణం చేయించాడు. ఒక మతాచార్యుడు కొరాన్ గ్రంథాన్ని డాక్టరు సుకర్నో తలమీద పైగా ఎత్తిపట్టుకునివుండగా ఆయన "నేను ఇండొనీసియా ప్రజలకీర్తి, క్షేమాల కొరకు పాటుపడతాను" అని ప్రమాణం చేశాడు.

ఈ అధ్యక్ష ప్రతిష్ఠాపనోత్సవానికి భారత కాన్సల్ పి. ఆర్. ఎస్. మణి, చైనా, క్యాథలిక్ జగద్గురువు పోప్ ప్రతినిధి, సమితి మధ్యవర్తి సంఘ సైనికపర్యవేక్షకులు మొదలైనవారు విచ్చేశారు. 3 వేల మందికిపైగా సభికులు అందులో పాల్గొన్నారు.

తెల్లనికొంగరెక్కలాంటి గబర్డీన్ సూటును వేసుకుని అధ్యక్షచిహ్నంగా బంగారు భుజకీర్తులను ధరించి డాక్టరు సుకర్నో పదవిని స్వీకరించాడు.

1945 లో మొట్టమొదట స్వతంత్ర రిపబ్లిక్ ను ప్రకటించేటప్పుడు ఉపయోగించిన తెల్లజండాను రిపబ్లిక్ సైనికదళం ఒకటి హాలులోకి తీసుకుని వచ్చింది.

ప్రతిష్ఠాపనోత్సవం ముగిసిన తరువాత డా॥ సుకర్నో 45 నిమిషాల సేపు ఈక్రింది విధంగా ప్రసంగించాడు.

"ఇరవై అయిదు సం॥ల నుంచీ ఇండొనీసియా ప్రజలకు నేను సేవకుడుగా ఉంటున్నాను. మీ తొలి అధ్యక్షుడుగా నన్ను ఎన్నికకు తగినవాడినని పించుకొనటానికీ, మీరు నామీద వేసిన కార్యభారాన్ని నిర్వహించటానికీ నేను ప్రయత్నిస్తాను. దీనికి భగవంతుడి అనుగ్రహం, మీతోడ్పాటు చాల అవసరం.

#### ముందడుగు

ఎప్పుడూ ముందడుగు వేయాలన్నదే మీ నినాదంగా తీసుకోవాలి. ముందుకు పోవాలన్న ఉద్దేశమే మీ ఆలోచనలలోనూ, చర్యల్లోనూ కనిపించాలి. మన ఉద్యమం ఇంకా పూర్తికాలేదు. ఇండొనీసియాను వ్యాపారిత్యా, ఆర్థికంగా, రాజకీయంగా గొప్ప జాతిగాచేసి ప్రపంచంలో దానికి అగ్రస్థానంలో ప్రతిష్ఠించటమే మన కర్తవ్యం. మనతోపాటుగా ముందడుగు వేయలేనివారు అభ్యుదయపు వెల్లువలో కొట్టుకుని పోగలరు.

మనం స్వాతంత్ర్య యుద్ధంలో తగిలిన గాయాలతో ఇంకా బాధపడుతునే ఉన్నప్పటికీ అల్పసంఖ్యాకులను రక్షించవలసిన బాధ్యత మనమీద ఉన్నది.

#### ప్రపంచ జాతులతో స్నేహం

నూతన ఇండొనీసియా ప్రపంచ జాతులన్నిటితోనూ స్నేహం చేయవాంఛిస్తున్నది. ఈ స్నేహాన్ని స్వీకరించాలని వారందరికీ నేను విజ్ఞప్తి చేస్తున్నాను. మా ప్రజల బాధలను తొలగించి జీవిత పరిస్థితులను అభివృద్ధి పరచటమే మా ఆశయం.

ఏకంగా నిలవమని ఇండొనీసియన్ ప్రజలందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను. ఐక్యత లేకపోతే జాతీయ విప్లవంపూర్తికాదు."

## కమ్యూనిస్టు చైనాకు బర్మా ప్రభుత్వ పరిగణన

### రంగూన్ నుండి అధికార ప్రకటన

రంగూన్, డిసెంబరు 17: బర్మాప్రభుత్వం ఈ వేళ కమ్యూనిస్టు చైనా ప్రభుత్వాన్ని గుర్తించింది. నేడు వెలువడిన బర్మా ప్రభుత్వ ప్రకటన ఇలాగున్నది. "మేము కేంద్రంలో ఏర్పడిన చైనాప్రజా ప్రభుత్వానికి ప్రజలతోడ్పాటు ఉన్నదని విశ్వసిస్తున్నాము. అదేగాక, చైనా ప్రజలకు, బర్మాప్రజలకు, చిరకాలానుగతంగా స్నేహసంబంధాలు ఏర్పడి ఉన్నాయి. ఈ కారణాలచేత బర్మా ప్రభుత్వం చైనా ప్రజల రిపబ్లికును గుర్తిస్తున్నది. ఉభయ ప్రభుత్వాల మధ్య త్వరలోనే రాయబార సంబంధాలు ఏర్పాటుగలవనీ, రాయబారుల ఏర్పాటు జరగగలదనీ భావిస్తున్నది."

కమ్యూనిస్టు చైనాను గుర్తించడంలో కమ్యూనిస్టు భిన్న ప్రభుత్వాలలో బర్మా మొట్టమొదటి స్థానం ఆక్రమించింది.

కమ్యూనిస్టు చైనా ప్రభుత్వం ఏర్పడినట్లుగా 1949 అక్టోబరు 1 వ తేదీని మొట్టమొదటగా ఒక ప్రభుత్వ ప్రకటన వెలువడింది. కమ్యూనిస్టు చైనా ఈ ప్రకటన అన్ని విదేశ ప్రభుత్వాలకు పంపింది. ఈ ప్రకటనలో "కమ్యూనిస్టు చైనాప్రభుత్వమే న్యాయశాస్త్రరీత్యా సమస్త చైనా ప్రజానీకానికీ ప్రతినిధి అయిన ప్రభుత్వ"మని ఉన్నది.

## అంతర్జాతీయ సంస్థలకు అదనంగా 65 కోట్ల రూపాయల చెల్లింపు

### రూపాయి మారకం రేటు తగ్గింపువల్ల భారతదేశంపై పడిన భారం

బొంబాయి, డిసెంబరు 17: రూపాయి విలువ తగ్గించుటవల్ల భారతదేశము అంతర్జాతీయ ద్రవ్యనిధికి అదనంగా ద్రవ్యము చెల్లించవలసియున్నది. భారతదేశపు చందా 40 కోట్ల అమెరికను డాలర్లుగా నిర్ణయింపబడియుండెను. రూపాయి విలువ తగ్గించుటవల్ల భారతదేశము ఈసంస్థకు 60 కోట్లరూపాయలు అదనపుచందా చెల్లించవలెను. రూపాయి మారకపు విలువ తగ్గించకపూర్వము భారతదేశము 2,75,30,000 రూపాయలు బంగారుగాను, 37,24,70,000 రూపాయలు చెల్లించవలసియుండెను.

ఈ విధముగానే భారతదేశము అంతర్జాతీయ బాంకుకు దాదాపు 5 కోట్లరూపాయలు అదనపుచందాగా చెల్లించవలసియున్నదని అధికార వర్గములవారు అంచనా వేయుచున్నారు.

### వెల్లూర్ గ్రామంవద్ద పోలీసులపై తిరుగుబాటు

తిన్నవెల్లి, డిసెంబరు 17: వెల్లూరు గ్రామ సమీపంలో పోలీసు కాల్పులవల్ల ఒకడు మరణించినట్లు వార్త వచ్చింది. ఇప్పటికి అందిన వార్తలనుబట్టి, కొంతమంది పోలీసులు, క్రిమినల్ కేసు ముద్దాయిల నిద్దరిని వెంటబెట్టుకొని వస్తుండగా వెల్లూరుగ్రామ సమీపంలో, కొందరు ప్రమాదకరమైన ఆయుధాలతో పోలీసు పార్టీని ఎదుర్కొన్నారని, అందుమీద పోలీసులు కాల్పులు జరపగా, ఒకరు మరణించాడని పలువురు గాయపడ్డారని తెలుస్తున్నది. జిల్లాపోలీసు అధికారులు సంఘటన జరిగిన ప్రాంతానికి దర్యాప్తు నిమిత్తం వెళ్లారు.

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 20 మంగళవారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 కె. జి. శివశ్రీ పాట. . ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి). 8-30 హిందీ పాఠము. 1-50 మద్రాసు (బి) వలె. మ. 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి). 4 30 పాశ్చాత్య సంగీతం (రి). సా 5-30 ఎం. చంద్రశేఖర్, వయొలిన్. 6, ఆంగ్లమున వార్తలు. 6-20 ఎస్. వి. కృష్ణమూర్తి. 7-30 గీతమంజరి (రి) 7-45 మధుర ఎస్. సోమసుందరం పాట. 9. ఆంగ్లమున వార్తలు. 10. వాద్య సంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ. 7-30 తెలుగున వార్తలు. 7-15 ఎల్. ని. వసంతకోకిలం రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 హిందీపాఠము 8-50 మేనక, సుశీల పాట. మ. 12. కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు, ప్రసిద్ధ వైజ్ఞానికులు, ఫ్లెమింగ్, ప్రసంగం. ఇ. భాష్యమయ్యంగార్, ప్రశ్నలు-జవాబులు నిర్వహణ టి. ఆరుముగం పిళ్లై. 1. మహిళామండలి, నానాదేశపు నృత్య వేదిక, బర్మీస్ ప్రసంగం. ఎస్. సామ్రాజ్యం, ఆహార విషయము, కాయగూరల ప్రాధాన్యము. ప్రసంగం. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు కవితాసముచ్చయములు. భగవత్ స్తుతి మన సంగీతం 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు ప్రపంచపు ఎడారులు. అరేబియా ఎడారి. ప్రసంగం. యు. ఆనసూయ. మన దేవాలయములు శ్రీరంగపట్టణం దేవాలయం. ప్రసంగం. టి. వి.రంగాచార్యులు, బృందగానం బిసెంట్ థియొసాఫికల్ పాఠశాల, మద్రాసు సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయంసంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం సర్వలోకశవెంకట పార్వతీశ్వరుల గేయం. ఉద్ధరించవలసిన గ్రామవినోదాలు. బుర్రకథ, ప్రసంగం. 7 తెలుగున వార్తలు 7-15 సాధ్యంకాదా, శైల్లు క్రమలేనిదే శిక్షణాస్వ్రతి. ప్రసంగం 7-45 మద్రాసు (ఎ) వలె. 9-30 పాలఘాట్ కె. ఆర్. ఎస్. మణిఅయ్యర్ ప్రసంగం. 10 మద్రాసు (ఎ) వలె.

## విజయవాడ

ఉ. 7 తెలుగునవార్తలు 7-15 బి ఎస్. రాజయ్యంగార్ 7-30 షేక్ హసన్‌సాహెబ్ నాదస్వరం, 8. ఆంగ్లమునవార్తలు 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా) 8-30హిందీపాఠము 8-50సరస్వతులవెంకటరావు, పాట. మ. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు. 1 తారాపథం. (రి.) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు. సా. 5-30 షేక్ హసన్ సాహెబ్, నాదస్వరం. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి. ఘంటసాల వెంకటేశ్వరరావు రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసు నుండి.) 7 తెలుగున వార్తలు. 7-30 కళ్యంరలా ఆనందరావు, పాట. 7-45 లయభావ. 8 ఆపాల్య రూపకము. రచన పురుషోత్తం సత్యనారాయణరావు. 8-30 సరస్వతుల వెంకటరావు. 9 ఆంగ్లమున వార్తలు. 9-20 చిత్రవాణి. (రి.)

## హైద్రాబాదు

ఉ. 7-30 శ్రీ మన్మగవద్గీత. పండిట్ రామనివాసశర్మ. 7-45 సత్యనారాయణ్ భజన్. 8 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే.) 8 20 శ్రీమద్భగవద్గీత. తెలుగు వ్యాఖ్యతో కె. వి. ఎల్. శాస్త్రి. 8-35 ఈషప్రష్ట కృష్ణమూర్తి కర్నాటక సంగీతం 8-50 తెలుగున వార్తలు 9-15 బంగారీ ఖాన్ ఖయాల్ మ 12-30 కృష్ణమురారి (రికార్డులు) 1-0 రికార్డులు 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) సా 5-0 మహిళా మండలి తెలుగున గోపాలకృష్ణ బృందగానం. ఎన్. జానకి పి. మనోరంజని కె. వరలక్ష్మి లీలావతి రామచందర్ సితార్ ప్రాచీన భారతములో స్త్రీలు లలితకళలలో వారిపాత్ర ప్రసంగం ఎ. స్వరాజ్యలక్ష్మి 5-45 సత్యనారాయణ్ గీత్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం నూతన లేబీ ప్రజాలోక ప్రసంగం వి. బి. రాజా కృష్ణ రాయబారం హరికథ. 7-0 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 భూములు భూసార పోషణ ప్రసంగం ఆరోగ్య సూత్రాలు డాక్టరు ప్రసంగం 7-40 వాతావరణ సూత్రము (రి) వి. నారాయణమూర్తి తెలుగున ప్రసంగ 8-30 బంగారీఖాన్ ఖయాల్ కేహాన్ 8 45 ఫిల్మ్‌గానే (రి) 9-0 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 9-15 రామరాయ పట్టాభిషేకం రూపకం తెలుగున రచన కె. సీతారామయ్య 9-55 సత్యనారాయణ్ గీత్ 10-5 బంగారీఖాన్ ఘజల్ 10-20 తుమ్రి (రి) 10-35 బంగారీఖాన్ ఖయాల్ మాండ్ జోహాన్.

# ఆహారస్వయం సమృద్ధి నెహ్రూ ఉద్బోధ

(1 వ పేజీ తరువాయి)

ణం వృద్ధి పొందించాలంటే ముందుగా ఆహారంలో స్వయం సమృద్ధి కలిగించాలి ఆహార స్వయం సమృద్ధి రావాలంటే, జనం అందరూ దీనికి తోడ్పడాలి. అందులోను రైతులు ఈ విషయంలో బాగా నడుములు కట్టుకుని పనిచెయాలి. ప్రజలందరు బాగా తోడ్పడితే తప్ప ఒక్క ప్రభుత్వ ప్రయత్నాలవల్ల చెయ్యగలిగిందేమీ లేదు."

పండిత నెహ్రూ తాను మాట్లాడిన 20 నిమిషాలలోను, రైతుల సమస్యలు ముఖ్యంగా మున్ముందుగా సాధించాలనీ, వారు భారతదేశం జనాభాలో అత్యధికులుగా ఉండడమే దీనికి కారణమనీ, అయితే భారతదేశ సమస్యలు ఇలాగ వేర్వేరుగా విభజించడానికి వీలులేదనీ, అన్నారు. నెహ్రూ యీ విషయంలో ఇంకా యిల్లాగ చెప్పారు. గత 150 సంవత్సరాలలోను జరిగిన ఆంగ్లపరిపాలనలో భారతదేశం స్థావరంగా ఉండిపోయింది. అందుచేత గత 150 సంవత్సరాల నించీ ఏర్పడిన సమస్యలన్నీ ఒక్కసారిగా మనలను ఎదుర్కొన్నాయి. బ్రిటిషువారు భారతదేశం విడిచి వెళ్లిన తరవాత, ద్వితీయ ప్రపంచ సంగ్రామంవల్ల మిగిలిన దేశాలలోలాగ, మన దేశంలోకూడా ఆర్థిక వ్యవస్థ తారుమారయింది. ఆపైన దేశ విభజనవల్ల మనం అనేకమైన క్లిష్ట సమస్యలు ఎదుర్కోవలసి వచ్చింది. సైన్యము, రైల్వేలు, రవాణా సౌకర్యాలు మొదలయినవాటి అన్నిటిలోను ఒక్కసారిగా బ్రహ్మాండమయిన మార్పులు వచ్చాయి. వీటి అన్నిటినీ రెండుగా విభజించి వెయ్యడంవల్ల దేశంలోని ఆర్థిక వ్యవస్థకు మరింత గట్టి దెబ్బ తగిలింది.

మనం ఈ సమస్యలన్నిటినీ సాధించాలి. ఉత్పత్తి అధికం చెయ్యడంవల్లనే మనమీ సమస్యలన్నీ సాధించగలుగుతాము. ఏ దేశమైనా స్వతాను ఉత్పత్తి చెయ్యగలిగిందే ఖర్చుపెట్టగలదుగాని అంతకంటె ఎక్కువగా ఖర్చుపెట్టలేదు. ఆర్థిక స్వాస్థ్యం సాధించాలంటే ఇంతకంటె గత్యంతరంలేదు. ఉత్పత్తి అభివృద్ధి కాకపోతే ప్రజలకు అందులో భాగం ఎల్లాగ వస్తుంది?"

పండిత నెహ్రూ ఇంకా ఈ విధంగా ఉద్బోధించారు. "యంత్రాగారాలలోను వ్యవసాయ క్షేత్రాలలోను అమెరికా ప్రజలు కష్టించి పనిచెయ్యడంవల్లనే ఆ దేశప్రజల ఐశ్వర్యం ఇనుమడించింది. అమెరికా ఒక ఎకరంనేలలో ఉత్పత్తి చేసేదానిలో నాలుగోవంతు మాత్రమే మనదేశంలో ఉత్పత్తి చేస్తున్నాము. ముమ్మరంగా సాగు చెయ్యడంవల్లనే, మన దేశంలోకూడా ఎక్కువపంట పండించవచ్చును. మనం ట్రాక్టర్లనే ఉపయోగించవలసిన అవసరం ఏమీ లేదు. సామాన్యమైన నాగళ్ళతోనే మనకున్న ఎరువులు ఉపయోగిస్తే ఎక్కువపంట పండించవచ్చును. మనం ఆంగ్లేయప్రజల సాహసను ఓరిమి అలవాటు చేసుకోవలసిందని మిమ్మల్ని అర్థిస్తున్నాను. ఆ దేశప్రజలు కూడా చాలా క్లిష్టమైన పరిస్థితులు ఎదుర్కొని, సాహసంతో తమసమస్యలు సాధించుకుంటున్నారు."

ఆసియాలో జరిగిన సంఘటనలను గురించి మాట్లాడుతూ ఇల్లాగ చెప్పారు. "ఆసియాలో దేశాలన్నీ అతి త్వరితంగా మారిపోతున్నాయి. ఈ దేశాలన్నిటిలోను కూడా ప్రజలు క్లిష్టమైన సమస్యలు ఎదుర్కొంటున్నారు. చైనాలో ఒక గొప్ప విప్లవం వచ్చింది. ఈ పరిస్థితులలో మనం సరియైనమార్గం అవలంబించాలి. ఇండియాలో ఈ సమయంలో కల్లోలం వచ్చిందంటే ప్రజలు అనేక యమయాతనలు అనుభవించవలసి ఉంటుంది. ఈ విషయం అందరూ జాగ్రత్తగా గ్రహించి, దేశాన్ని దృఢతరంగాను ఐశ్వర్యవంతంగాను చెయ్యాలి. రెండుమూడేళ్ల దాకా ప్రజలు చిన్నచిన్న తగాదాలన్ని విస్మరించి, తమ యావచ్ఛక్తి అధికాహారోత్పత్తికై వినియోగించాలి. దీనివల్ల ప్రజలకందరికీ శాంతిభద్రతలు కలుగుతాయి.

పండితనెహ్రూగారు పూర్వం భారత ప్రభుత్వం ఆహారశాఖ కమిషనను మాట్లాడుతూ, మనదేశంలో రైతులు దూడపేడ వంట చెరకుగా ఉపయోగించడంవల్ల పొలాలకు తగిన ఎరువులు లేకుండా పోతున్నాయనీ, రైతులు ఈ విషయం బాగా గమనించాలనీ, ధరవారి ధాన్య విక్రయంలోకూడా దళారీ వ్యాపారస్థులు లాభాలు ఎక్కువగా తీసుకోకుండా చూడాలనీ, భారతప్రభుత్వం తరఫునిర్ణయం ఏర్పాటు చెయ్యాలని చూస్తున్నదనీ, రైతులు విత్తనాలు మంచివి సంపాదించుకోవడం కూడా అవసరమనీ, దీనివల్ల పంటబాగా అభివృద్ధి పొందుతుందనీ అన్నారు.

అనంతరం చౌదరీ రణబీర్‌సింగ్ అనే మరొకపార్లమెంటు సభ్యుడు మాట్లాడుతూ, రైతులకు తేలికగా ఋణాలు అప్పు ఇచ్చే సంస్థ ఒకటి ఏర్పాటు చెయ్యాలని చెప్పారు.

# కాశ్మీర్‌సమస్య: మండలి అధ్యక్షునికి అధికారం

(1-వ పేజి తరువాయి)

.. సమస్యా పరిష్కార మార్గాలు దెబ్బతిన్న అనంతరం ఏకవ్యక్తి పరిష్కర్తృత్వం ఎంగుకు అవసరమైనదిగా తాము భావించిరో రిపోర్టులో సమగ్రంగా వివరించబడిందని, ఒక్క జెకొస్లొవేకియా ప్రతినిధి డా॥ ఆర్ క్రిజ్ చైల్ మాత్రం మైనారిటీరిపోర్టు పంపించారని సేనార్ లాంపర్ పేర్కొన్నారు.

లాంపర్ ఇంకా ఈలా అన్నారు: కమిషన్ ఒక రకంగా విజయాన్ని సాధించింది దాన్ని మనం మరిచిపోకూడదు. ఇప్పుడు కాశ్మీర్‌లో యుద్ధం లేదంటే దానికి కారణం కమిషన్ కృషే. అని అంగీకరించక తప్పదు. ఇది తక్కువపని ఎంత మాత్రం కాదు.

ఇప్పుడు ఒక రకమైన ప్రతిష్టంభన ఏర్పడింది. అందువల్ల మనం చేస్తున్న ప్రయత్నాలను ఆపి, ఈ ప్రతిష్టంభనకు దారి తీసిన పరిస్థితులను గూర్చిన సమాలోచనలకు దిగవలసివుంది.

ఈ సమస్యనుగూర్చి ఈ సంఘంలో చర్చించడం అనవసరమనే నేను అనుకుంటున్నాను. చర్చలలో కొంతెంతెప్పుడేర్పడితే సరికి గౌరవా గౌరవాలు, ప్రతిష్టా ప్రతిష్టలు జనులోకి వస్తూవుంటాయి.

అందువల్ల సంఘాధ్యక్షులు ఇండియా, పాకిస్థాన్ ప్రతినిధివర్గాలను రెండింటిని కలిసికొని వారితో సంప్రతించి ఇరువర్గాలవారికి అనుకూలంగానూ, తృప్తికరంగానూ వుండే పరిష్కారమార్గాన్ని కూర్చి ముదలకించడం యోగ్యంగా తట్టుతోంది.

ఆ యా పార్టీలతో తానుజరిపిన సంభాషణల ఫలితంగా ఏదన్నా ఫలప్రదమైన పరిష్కారమార్గం తనకు గోచరిస్తే, సంఘాధ్యక్షులు దాన్ని సంఘం వారికి నివేదించవచ్చును.

అనంతరం నార్వే ప్రతినిధి తమ సూచనను ప్రతిపాదించగా బ్రిటన్, ఫ్రాన్సులు ఆ ప్రతిపాదనను బలపరిచాయి.

అధినివేశ రాజ్యాల మధ్య పోరు పదరడం తనకెంతేయు ముదావహమైన విషయంగా, సంఘాధ్యక్షులు జనరల్ మేన్‌నాటన్ పేర్కొన్నారు.

ఇండియా, పాకిస్థాన్ ఈ సమస్య విషయంలో ఏమి చెప్పదలచుకున్నదో వినకుండా, ఇటువంటి కార్యక్రమానికి దిగడం భవ్యంగా లేదని సోవియట్ ప్రతినిధి అన్నారు.

నార్వేజియన్ ప్రతిపాదన అప్పుడే అంగీకరించబడిందని, అయినా ఇండియా, పాకిస్థాన్‌లో ఏమన్నా చెప్పదలచుకుంటే, అందుకు అభ్యంతరమేమీ లేదని సంఘాధ్యక్షులు అన్నారు.

కాని సోవియట్ ప్రతినిధి నార్వేజియన్ ప్రతిపాదనను ఓటుకు పెట్టాలని అన్నమీదట, అధ్యక్షులు దాన్ని ఓటుకు పెట్టగా, ప్రతిపాదనకు అనుకూలంగా 9 ఓట్లు వచ్చాయి. వ్యతిరేకంగా ఎవ్వరూ లేరు. సోవియట్ యూక్రైన్ లు మాత్రం తటస్థంగా వున్నాయి.

దానితో నార్వేజియన్ ప్రతిపాదనను సంఘం ఆమోదించినట్లు ప్రకటించారు. సంఘ సమావేశం అనంతరం వాయిదా పడింది.

## జెక్‌సభ్యుని నివేదిక

లేక్ ఎక్సెస్, డిసెంబరు 17: కాశ్మీర్ సమస్యా పరిష్కారవిషయంలో కమిషన్ వారు జయప్రదం కాకపోవడానికి వారుచేసిన పొరపాట్లే చాలావరకు కారణమని డా॥ ఆర్. క్రిజ్ చైల్ తాను ప్రత్యేకంగా భద్రతాసంఘానికి సమర్పించిన మైనారిటీ రిపోర్టులో పేర్కొన్నారు.

కమిషన్ కార్యకలాపాలు ఇట్లా పాడైపోవటానికి సగం బాధ్యత బ్రిటన్ అమెరికాలమీద వుంచవలసివుంది. అనికూడా ఆయన ఈ రిపోర్టులో అన్నారు.

ఇండియా పాకిస్థాన్లతో వ్యవహరించడంలోగూడా ఈ కమిషన్ ఎన్నివిధాలుగా తప్పుదారి తొక్కిందీ వివరిస్తూ, ఇక భద్రతాసంఘం ఈ సమస్యా పరిష్కార నిమిత్తం ఇంకో కమిషన్ను నియమించాలని, ఇందులో భద్రతాసంఘ సభ్యులందరికి సభ్యత్వం వుండాలని, డా॥ చైల్ సూచించారు.

కాశ్మీర్ పరిస్థితికి సంబంధించినంతవరకు దీనికి భద్రతాసంఘం ఇచ్చిన ఆదేశంవల్ల ఆ పరిస్థితి ఏవిధంగా వున్నది పరిశీలించి అనగలిగే చేయగలిగినంత మేరకు సర్వాధికారాలు వున్నాయి. ఆ కార్యాన్ని కమిషన్ బాగానే నిర్వహించింది.

కాని సమస్యా పరిష్కార విషయంలో వీరు చేసిన ప్రయత్నాలన్నీ సరియైన మార్గాల్లో నడిచి, ఆ సమస్య తీరుమానం అయ్యేందుకు వినియోగపడాయని అనడానికి వీలులేకుండా వుంది.

(1) 1949 ఆగస్టు 22 వ తేదీనాడు ఇండియా పాకిస్థానుల సమావేశపరచడానికి కమిషన్ నిశ్చయించింది. అందుకు ఆ రెండు దేశాలు అంగీకరించాయి. కాని కమిషన్ ఆ సమావేశాన్ని రద్దుచేసింది.

కమిషన్ చేసిన తప్పుల్లో ఇది ఘోరమైంది. దీన్ని భద్రతాసంఘం గుర్తించవలసివుంది.

(2) కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి పరిష్కర్తృత్వాన్ని మార్గంగా కమిషన్ సూచించింది. ఇందులో కమిషన్ తన హద్దులను దాటి ప్రవర్తించిందనే చెప్పాలి.

(3) అంతే కాకుండా ఈ పరిష్కర్తృత్వ సూచనను ఈ కమిషన్ ముందుగా ఇండియా పాకిస్థాన్లకు తెలియచేయకుండా, బ్రిటన్ అమెరికాలకు తెలియజేసింది. ఇది ఇంకో పొరపాటు. ఇట్లా చేయటంవల్ల ట్రూమన్ సభాపతి, అట్లీ ప్రధాని, ఒత్తిడి చేస్తారన్న భావం కమిషన్‌కు బాగావుంది, ఆ ఒత్తిడి తీసుకువచ్చే ఉద్దేశంతోనే అట్లా చేసింది

(4) ఇంకోవిషయ మేమిటంటే, కమిషన్ చేసిన ఈ సూచనయొక్క పూర్తి పాఠం ఇండియా, పాకిస్థాన్లకు అధికారంగా అనంతరం తెలియజేసినప్పుడో, లేకపోతే అంతకు కొంచెం ముందుగానో, ఢిల్లీలోనూ, కరాచీలోనూ వున్న బ్రిటిష్ హైకమిషనర్లకు అందజేయబడింది.

(5) 1948 ఆగస్టు 13 తీర్మానాన్ని తయారుచేసిన సందర్భంలో ఈ కమిషన్ కొన్ని ముఖ్య విషయాలను సరిగ్గా అర్థం చేసుకోకుండా వ్యవహరించింది. ఆజాద్ కాశ్మీర్ సైన్యాల ఉనికినిగురించి అప్పుడు తీవ్రంగా కమిషన్ ఆలోచించిన పాపాన పోలేదు సరికదా, ఉత్తర కాశ్మీర్ ప్రాంతాలనుగూర్చి గూడా సరిగ్గా విచారించలేక పోయింది. తరువాత ఈ రెండు సమస్యలే కమిషన్ కార్యకలాపాలను కుంటు పరుస్తూ వచ్చాయి.

(6) దీనికితోడు కమిషన్ ఇటు ఇండియాలోగాని, అటు పాకిస్థాన్‌లోగాని, ప్రజలలో తగిన ఉత్సాహాన్ని కల్గించలేకపోవడమేకాకుండా, వారి విశ్వాసాన్ని గూడా చూరగొనలేక పోయింది.

ఈ విశ్వాసాన్ని గడించనికారణంగా ఏర్పడిన విపరీత వాతావరణం కమిషన్ తరువాతి కార్యక్రమం అంతటిలోను బాగా వ్యక్తంగా కనపడుతూనే వుంది.

ఏ సమస్యలమీద ఖచ్చితమైన అభిప్రాయాలను ఏర్పాటుచేసుకోవాలో ఏ సమస్యలమీద అక్కరలేదోగూడా ఈ కమిషన్ పట్టినట్లులేదు. అటువంటిచోట్ల ఏదో వివరణలంటూ, వాగ్దానాలంటూ పోయి, తన ఉనికినే తానులా సుసానుచేసుకున్న కారణంగా ఏవిధమైన కార్యాన్నిగూడా సాధించలేనిస్థితిలో ఈ కమిషన్ పడిపోయింది.

కాశ్మీర్ సమస్య పరిష్కారం కాకుండా అవరోధంగా నిలబడిన మూడు విషయాలను కమిషన్ తన రిపోర్టులో పేర్కొన్నది. అవి:

(1) అజాద్ కాశ్మీర్ సైన్యాలను గూర్చిన సమస్య.

(2) సంస్థానంలోని ఉభయసైన్యాల ఉపసంహరణ.

(3) ఉత్తర కాశ్మీర్ ప్రాంతం.

ఈ సమస్యలు నిజంగా కమిషన్‌కు తీరుకుడు పడకపోయినాయంటే, అందుకు కారణం 1948 ఆగస్టు 13 వ తేదీనాడు కమిషన్‌వారు ఆమోదించిన తీర్మానంలో వున్న లోపాలే అని ఖచ్చితంగా చెప్పనచ్చును.

పోతే ఆగస్టు 13 తీర్మానంలో రెండో భాగం అమలు జరగడానికి పెట్టిన షరతు పరిపాలింపబడక పోవడానికికూడా ఈ ఆజాద్ సైన్యాలను గూర్చిన అంశాన్ని కమిషన్ గుర్తించక పోవడంవల్లనే జరిగింది. ఈ లోపం ఆజాద్ సైన్యాలు బాగా పెరిగిపోయాయి. 1949 వ సంవత్సరం వచ్చేసరికి అవి 32 బెటాలియన్లదాకా పెరిగాయి. ఈ సైన్యాలు ఒక శక్తిగా తయారైనట్లు కమిషన్‌తో వున్న సైనిక పరిశీలకులుగూడా అన్నారు.

ఈ ఆజాద్ సైన్యాల అవతరణతో పరిస్థితి తీవ్రంగా మారిపోయింది. కమిషన్ తీర్మానంలో అటు ఇండియాగానీ, ఇటు పాకిస్థానుగాని తమ సైన్యాలను ఎంత మాత్రం పెంచగూడదన్న షరతు ఒకటి వుంది. కాని ఆ షరతును పాకిస్థాన్ ప్రభుత్వం వారు పాటించని కారణంగా ఈ ఆజాద్ సైన్యాల విషయం ఒక సమస్యయై కూర్చుని, పరిస్థితినంతా తారుమారు చేసింది.

ఈ సమస్యతో ఇతర సమస్యలు తలెత్తాయి. ఈ సైన్యాలను రద్దుచేయడం అనే ఒక సమస్య అయింది. ఇది వుంటూవుండగా ఇండియా పాకిస్థాన్ సైన్యాలను ఒకేసారిగా ఉపసంహరించడం ఎట్లాగ అన్న సమస్య ఇంకోటి బయలుదేరింది.

ఇట్లా కమిషన్‌కు తగిన తెలివితేటలు లేకపోయిన కారణంచేత ఇతర సమస్యలను పరిష్కరించడానికి అనవసరమైన మార్గాలను దిద్దడం సాధ్యం కాలేదు. ఇటువంటి సమస్యల్లో ఈ ఉత్తర కాశ్మీర్ ప్రాంతాల విషయం వస్తుంది.

ఈ ప్రాంతాల విషయంలోగూడా కమిషన్ వాటి ప్రాముఖ్యాన్ని గుర్తించి వాటు ఎక్కడా కనుపించదు. ఈ విషయం ఆగస్టు 13 తీర్మానంలో కనుపించనట్లే. ఆతరువాత అంగీకరించిన 1949 జనవరి 5 తీర్మానంలోగూడ కనపించలేదు.

ఇండియా ప్రభుత్వం కమిషన్ చేసిన ఈ పొరపాటును గుర్తించి ఆగస్టు 13 తీర్మానాన్ని అంగీకరించే సందర్భంలో ఈ ఉత్తర కాశ్మీర్ ప్రాంతంమీద తన అభిప్రాయాన్ని కమిషన్‌కు నివేదిస్తూ దాన్ని ఆజాద్ ప్రాంతంగా గుర్తించేందుకు ఎంతమాత్రం వీలులేదని పేర్కొన్నది.

అప్పుడుగూడా ఈ కమిషన్ తాను చేసిన తప్పును గుర్తించి ఈ విషయాన్ని ఒక అనుబంధంలాగా తీర్మానానికి చేర్చకుండా 1948 ఆగస్టు 28 వ తేదీ నాడు భారత ప్రధానికి ఒక ఉత్తరం వ్రాస్తూ, ఆ విషయాన్ని ఆగస్టు ఆ 13 తీర్మానం చర్చకు వచ్చినప్పుడు పరిశీలించవచ్చునని హామీ ఇచ్చింది.

ఇండియా బయటపెట్టిన ఈలోపాన్ని తీర్మానంలో చేర్చనిపాపం ఒకటి ఈ కమిషన్ చేయడంచేత, అది తీర్మానంలో ఎక్కడా లేకుండాపోగా, ఇప్పుడు దాన్ని కల్లబొల్లి మాటలతో కప్పిపుచ్చుతూ, మేము అప్పుడు పూర్తిగే అటువంటి ఉద్దేశం వున్నట్టుమాత్రమే అన్నాముగాని తీర్మానంతో విచారిస్తామని అన్నామా అని తన రిపోర్టులో వ్రాసుకోవలసిన గతిపట్టింది.

పాకిస్థాన్ ఈ పరిస్థితిని బాగా ఉపయోగించుకుంది. అందువల్ల కమిషన్‌వారు 1948 ఆగస్టు 25 వ తేదీ నాడు ఇండియా ప్రధానికి వ్రాసిన ఉత్తరంలో ఇచ్చిన హామీని తమ్ము ఏవిధంగా బంధించదని పాకిస్థాన్ పేర్కొన్నది. అది ఇండియా ప్రధానికి, కమిషన్‌కు మధ్య ఉండిన ఉత్తర ప్రత్యుత్తరాలలో వున్నది. కాబట్టి, దాన్ని పాటించాలనే నియమం ఎక్కడాలేదని పాకిస్థాన్ వాదించింది.

అందువల్ల 1948 ఆగస్టు 25 తేదీ నాడు కమిషన్ భారత ప్రధానికి వ్రాసిన ఉత్తరాన్ని ఇండియా ఒకవిధంగానూ, పాకిస్థాన్ ఇంకో విధంగానూ తీసుకొన్న కారణం రెండింటి మధ్య ఎక్కడా పొత్తు కుదిరే సావకాశం లేకుండా పోయింది.

పోతే ఇక ఖాళీచేయబడిన ప్రాంతాలు అంటే ఏమిటో తెలుసుకోవలసివుంది. ఈ ప్రాంతాలంటే ఏమిటి అన్న విషయాన్ని వివరిస్తూ పాకిస్థాన్ 1948 సెప్టెంబరు 3 వ తేదీ కమిషనుకు ఒక వుత్తరం వ్రాసింది. అప్పటికి పాకిస్థాన్ అధీనంలోవున్న అన్ని ప్రాంతాలను అది ఈ నిర్వచనం క్రిందకు అప్పుడే తెచ్చింది.

ఇప్పుడు వుత్తర కాశ్మీర్ ప్రాంతాలకు సంబంధించిన సమస్యలోని కీలకం అంతా అందులో వున్నదని కమిషన్ తన తెలివి తక్కువవల్ల అప్పుడు గుర్తించలేకపోయింది. అందువల్ల ఆ విషయంలో సమాధానం కుదురుద్దామని ప్రయత్నించి కూడా కమిషన్ విజయమైపోతూ వచ్చింది.

నిజానికి ఇండియా ఈ విషయాన్ని కమిషన్‌వారి దృష్టికి 1948 ఆగస్టు 20 వ తేదీనాడే తెచ్చినప్పటికీ, దానిలో వున్న అంతరార్థం కమిషన్‌కు అర్థం కావడానికి సెప్టెంబరులో పాకిస్థాన్ ఉత్తరం అందితే నేగాని సాధ్యమైనది కాదు. అప్పటికే పాకిస్థాన్ అక్కడ తనదిపై చేయి చేసుకొని, ఆ ప్రాంతాల రాజకీయ భవిష్యత్తు వ్యాఖ్యనంతా కప్పిపుచ్చినదన్నా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

కొన్ని ఇబ్బందులవల్ల కాశ్మీర్‌లోని వివిధభాగాలలో ప్రవర్తిల్లే పరిస్థితిని అవగతం చేసుకోగల సావకాశం తనకు లేకపోయిందని కమిషన్ తన రిపోర్టులో ఇప్పుడు పేర్కొంటున్నది. ఈ కారణంవల్లనే ఇండియా ఇల్లడిచేసిన ఆ యా విషయాలలో కమిషన్ పట్టుదలతో వ్యవహరించి వుండవలసిందని నేను అంటున్నాను. పట్టి వాగ్దానాలతో లాభంలేదని కమిషన్ అప్పుడే గ్రహించి వుండవలసిందని వాదిస్తున్నాను.

అందువల్ల ఉత్తర కాశ్మీర్ ప్రాంతాలలో పరిస్థితిగూడా తారుమారైంది. ఇండియాకు తామిచ్చిన వాగ్దానం సరియైనదేనంటూ, దాన్ని ఆచరణలో పెట్టే తాహతు తనకు ఎంతమాత్రం లేదని అప్పుడన్నా ఈ కమిషన్ అంగీకరించివుంటే ఎంతో బాసుండేది.

కమిషన్‌కులేని దూరదృష్టిని బాగా ఉపయోగించుకొనే పాకిస్థాన్ ప్రభుత్వం 1949 ఏప్రెల్ 26 వ తేదీనాడు వ్రాసిన ఇంకో ఉత్తరంలో 1948 సెప్టెంబరు 3 వ తేదీనాడు తాము వ్రాసిన ఉత్తరంలోని అంశాలను పేర్కొంటూ ఉత్తరకాశ్మీర్ ప్రాంతము తమ అదుపులోనే వుండిపోవాలన్నట్లు వ్రాయగలిగింది.

కమదృష్టిలో ప్రవర్తిల్లిన ఈ లోపాన్ని సవరించక పోవడానికి కమిషన్ ఎన్ని కారణాలను చెప్పినా చెప్పవచ్చును. అయినా, ఆగస్టు తీర్మానంలోని రెండోభాగం అమలు జరక్కపోవడానికి కాశ్మీర్ కమిషన్ బుద్ధితక్కువతనమే కారణమన్న విషయంమాత్రం నిర్వివాదమైన అంశం.

1949 ఏప్రెల్ 28 తేదీనాడు కాశ్మీర్ కమిషన్ చేసిన ప్రతిపాదనలు, వాటిని ఒప్పించడానికి చేసిన ప్రయత్నాలు అన్నీ విఫలమైన తరవాత, కమిషన్‌లో ఎక్కువ మంది సభ్యులు తమ ప్రయత్నం కొనసాగదన్న భావానికి వచ్చేశారు. అప్పటినంచి కమిషన్‌లోని అమెరికా ప్రతినిధివర్గ పరిష్కర్తృత్వంద్వారా కాశ్మీర్ సమస్యను పరిష్కరిస్తే బాగుంటుందంటూ, ఇతర సభ్యులకు సూచనలు చేయడం ప్రారంభించారు.

ఆ తరువాత వారి ఈ ప్రయత్నం ఒక తీర్మాన రూపాన్ని పొందింది. ఈ సందర్భంలో కమిషన్‌లోని జెక్ ప్రతినిధివర్గం అమెరికా ప్రయత్నాన్ని హర్షించక, అటువంటి ప్రయత్నం చేసేముందు ఇండియా, పాకిస్థాన్లను సమావేశపరిచి వారి అభిప్రాయాలనుగూడా తెలుసుకోవాలని, అట్లా తెలుసుకోకముందు కొత్త ప్రయత్నాలు చేయడం న్యాయంగాని, ధర్మసమ్మతంగాని కాదని వాదించింది.

అప్పుడు కమిషన్‌వారు జెక్ ప్రతిపాదనను అంగీకరించడానికి ఒక షరతు పెట్టి, యుద్ధవిరామ సరిహద్దు ఏర్పాటైన తరువాత అటువంటి సమావేశాన్ని ఏర్పాటుచేద్దామన్నారు. యుద్ధవిరామ సరిహద్దు ఏర్పడిన తరువాత, జెక్ ప్రతినిధివర్గం తన ప్రతిపాదననుగూర్చి ఆలోచించవలసిందని కమిషన్‌ను కోరింది.

అంతకుముందుగూడా, ఈ విషయానికి కిన్నీ, కరాచీలో జరగబోయే సైనిక సంభాషణలకున్నూ ముడిపెట్టడం మంచిది కాదని, ఆ విషయానికి ఈ విషయానికి సంబంధం కల్పించరాదని, ఈ విషయాన్ని ప్రత్యేకంగా దాని యోగ్యతనుబట్టి మాత్రమే పరిశీలించాలనికూడా జెక్ ప్రతినిధివర్గం స్పష్టంచేసింది.

ఇటువంటి పరిష్కర్తృత్వానికి అడ్మిరల్ చెస్టర్‌నిమిట్జిని నియమించడంవల్లగూడా జెక్ ప్రతినిధివర్గం వైముఖ్యాన్ని ప్రదర్శించింది.

ఇండియా పాకిస్థాన్లను కలిపి, సంప్రదించందే ఇటువంటి ప్రయత్నం చేయవద్దని జెక్ ప్రతినిధివర్గం హెచ్చరించినా గూడా కమిషన్ ఆమాటను పాటించకుండా తనదారి తాను త్రొక్కింది.

అటువంటి సమావేశాన్ని ఏర్పాటు చేయడానికి కమిషన్ అంగీకరించేనాటికే పరిష్కర్తృత్వప్రపథకం తయారై వుంది. ఇది అసహజమైన విషయం. రాజకీయంగా అయోగ్యమైన కార్యం.

ఇటువంటి ప్రతిపాదన చేయడానికి అసలు కమిషన్‌కు ఎటువంటి అధికారమున్నూ లేదు. పోగా, ఈ పరిష్కర్తృత్వ ప్రతిపాదనల విషయంలో కమిషన్ నడవడిని పరికిస్తే, ఇందులో బయటివారి ప్రమేయం ఖచ్చితంగా వున్న చాయలు అందరికి పొడకట్టుతాయి. నిజానికి కమిషన్ తనకు భద్రతాసంఘం ఇచ్చిన ఆదేశాన్ని పురస్కరించుకొనిమాత్రమే పనిచేయాలి. ఐక్యరాజ్యసమితి గౌరవప్రతిష్టలకు అనుకూలంగా పనిచేయాలి. అయినా బయటివారి ప్రమేయం అందరికీ ఇచ్చట కనపడుతునే వున్నది.

అదికాకుండా ఈ విషయంలో ట్రూమన్ సభాపతి, అట్లీ ప్రధాని ప్రమేయం పెట్టుకున్నారంటే, అది కమిషన్ ప్రోద్బలం లేకుండా జరిగిందని ఎవరన్నా అనుకుంటారా? కాశ్మీర్ సమస్య ఐక్యరాజ్య సమితి అంతకు సంబంధించింది. అందువల్ల దాన్ని పరిష్కరించడంలో సమితి విధించిన నిబంధనలు, ఇచ్చిన హామీలు అన్నీ గౌరవించబడాలి.

ఇప్పుడు కాశ్మీర్ విషయంలో అమెరికా, బ్రిటన్‌లు పెట్టుకున్నట్లు, సమితిలోవున్న అన్ని దేశాలు అన్ని సమస్యల విషయాలలోను చేయిచేసుకుంటే, సమితియొక్క కార్యకలాపం అంతా స్తంభించిపోతుంది.

అందువల్ల ఈ సమస్య శాంతియుతంగా పరిష్కారం కావాలంటే, ఈ కమిషన్ కొన్ని అగ్రరాజ్యాలచేతుల్లో కీలుబొమ్మగా ప్రవర్తించకుండా చూడాలి.

ఇప్పుడు ఈ కమిషన్ ఇట్లా దెబ్బతిన్నది గదా అని కాశ్మీర్ విషయంలో ఇక ఎటువంటి ప్రయత్నం చేయకూడదని నా అభిప్రాయం కాదు. ఇప్పుడు కావలసిందల్లా, కాశ్మీర్‌లో పరిస్థితులు ఎట్లా వున్నాయి అన్న దానినిగూర్చి ఇంకా ఎక్కువగా పరిశీలించడమే.

కాశ్మీర్ కమిషన్ స్వీయ రిపోర్టులో సిగరు సభ్యులతోనూ, అంతకన్నా ఎక్కువ మందితోనూ, గూడిన విచారణసంఘాల వల్ల పని జరగదు అని అంటున్నది. అట్లా అనే అధికారం దానికి ఎక్కడనుంచి వచ్చిందో నా కర్థంకాకుండా వుంది. అటువంటి అభిప్రాయాన్ని వెలిబుచ్చడం అనవసరం.

కమిషన్‌లో విసులుబాటు లేకపోవడంచేత దీనికతి ఇట్లాపట్టిందనడం పొరపాటు. నిజానికి వల్లమాలిన విసులుబాటు వున్నందువల్లనే ఈ కమిషన్ దెబ్బతింది. వివాదంలో అటూ,ఇటూవున్న రెండు పార్టీలను సంతృప్తిపరచాలని చేతగాని ప్రయత్నం చేయడంవల్లనే ఈ కమిషన్ దెబ్బతింది. ఈ కమిషన్ రికార్డులు చూసిన ప్రతివానికి ఈ విషయం బోధపడుతుంది.

కాశ్మీర్ సమస్యా పరిష్కారానికి అందువల్ల నేనీ క్రిందిసూచనలచేస్తున్నాను. (1) కాశ్మీర్‌సమస్య విషయంలో మధ్యవర్తిత్వం వహించేందుకు ఇంకో కమిషన్ ఏర్పాటు చెయ్యాలి. ఇందులో బయటివాళ్ళప్రమేయం ఎంతమాత్రం పనికిరాదు.

(2) ఈ క్రొత్త కాశ్మీర్ కమిషన్‌లో భద్రతా సంఘంలోని 11 మంది సభ్యులకు ప్రాతినిధ్యం వుండాలి.

## సమితివర్గాల ఆశ్చర్యం

లేక్ సక్సెస్, డిసెంబరు 17: కాశ్మీర్ కమిషన్‌లోని జకోస్లావేకియా సభ్యుడు డా॥ ఆర్ చైల్ కమిషన్ నివేదికకు వ్యతిరేకంగా మైనారిటీ నివేదికను తయారుచేశాడన్న వార్త, సమితివర్గాలకు పిడుగుపాటులా ఉన్నది. ఈ నివేదిక, యిప్పాళ ఉదయం సమితి సభ్యులకు అందజేయబడింది.

కాశ్మీర్ తగాదా పరిష్కారానికి మధ్యవర్తిని నియమించాల్సిందిగా సూచిస్తూ కాశ్మీర్ కమిషన్ తన అధికారము, విధులకు మించి ప్రవర్తించిందని, డా॥ చైల్ తన నివేదికలో విమర్శించారు.

# మదరాసుకాంగ్రెస్ స్వదేశీ ప్రదర్శనం

## గవర్నరుజనరల్ ప్రారంభోపన్యాసము

మదరాసు, డిశంబరు 18:-"ప్రతియేట జరిగే ప్రదర్శనం గూర్చి అధికంగా చెప్పవలసిందేమీ లేదు. ఇట్టి ప్రదర్శనంలో లాభం వస్తుందనే జరుపుతారు ఆ లాభం తగ్గిపోకుండా ప్రతివారు టిక్కట్టుకొని ఎక్కువగా వచ్చి చూడాలి" అని కోరుచు గవర్నరు జనరలు సి. రాజగోపాలాచారిగారు నేడుదయం తేనంపేట కాంగ్రెసు స్వదేశీ ప్రదర్శన ప్రారంభోత్సవం జరుపుచు నుడివిరి. కామరాజనాడరుగారు స్వాగత వచనములు పల్కిరి ఇరువురు క్లుప్తంగా అరవంలో ఉపన్యసించిరి. గవర్నరు, ప్రధాన న్యాయమూర్తి, మంత్రులు పురపెద్దలు చిన్నలు కొన్ని లక్షలమంది ప్రారంభోత్సవమునకు వచ్చిరి. టిక్కట్ల నిర్బంధమంతగా లేదండెను. "ఇదివరకు ప్రదర్శనములకు ప్రభుత్వసహాయం అంతగా ఉండేది కాదు. ఇప్పుడీ ప్రదర్శనములకు ప్రజలసహాయం కన్న ప్రభుత్వ సహాయమే ఎక్కువగా లభించుచున్నది. నేనీపూరు వచ్చే సమయానికే దీన్ని ప్రారంభించి నాకు గౌరవం కలిగించినందుకు కృతజ్ఞత తెల్పుచున్నాను" అని రాజాజీ నుడివిరి తరువాత జీపులో నిలచి, అన్ని ప్రదర్శనశాలలు చూచి వెడలిపోయిరి.

## గాంధీనగర్‌లో గవర్నరుజనరల్

మదరాసు, డిశంబరు 18: భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు నేటి ఉదయం 8 గం॥లకు అడయార్ గాంధినగర్‌ను దర్శించిరి.

# ప్రత్యేకాంధ్రరాష్ట్రమును ఎదుర్కొనే సమస్యలన్నింటిని పరిష్కరించడానికి ఆంధ్రనాయకులు సమావేశం కావాలి

## —శ్రీ కల్లూరు సుబ్బారావుగారి సూచన

మదరాసు, డిశంబరు 17: "ఆంధ్ర నాయకులు వెంటనే ఒక్క రాజధాని, హైకోర్టువిషయమే గాక, విశ్వవిద్యాలయ ఉపసంఘమువారి సూచనప్రకారము ఏర్పడుచున్న విద్యాసంస్థలు, విజ్ఞాన సంస్థలు మరి ముందు రాష్ట్రసంపాదన తరువాత యావత్తు రాష్ట్రాభివృద్ధికి కావలసిన ఇతరసంస్థలు ఏవి ఏవి ఎచ్చటెచ్చట ఎప్పుడు నిర్ధారణగా నెలకొల్పవలసినది ఒక పథకము నిర్ణయించుకొనుట ఆవశ్యకరం దానికై ఆంధ్రరాష్ట్రములోని పెద్దలందరూ పూనుకొనవలెను" అని రాయలసీమ నాయకులు శ్రీ కల్లూరు సుబ్బారావు యం. యల్. ఎ. యం. సి. ఎ. గారు నేటొక ప్రకటనలో సూచించిరి.

శ్రీ సుబ్బారావుగారు తమప్రకటనలో ఇంకనూ ఇట్లు తెలిపిరి. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ విషయములో మదరాసు ప్రభుత్వ విభాగ కమిటీనిర్ణయములు జరుగుచున్నవి. భారతప్రభుత్వమువారి కోరిక మేరకు ఆంధ్రరాష్ట్రమునకు రాజధానీ నగర మెయ్యదీ నిర్ధారణగా తెలుపవలసినదనీ కూడ కోరినట్లు తెలియుచున్నది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము నిశ్చయము అని తెలిసిన ఈ సమయములో ఆంధ్రులెల్లరు సురతర బాధ్యతతో ఆంధ్రదేశముయొక్క భావి సౌఖ్యము, ఐక్యము, సుఖము, సౌభాగ్యము మనస్సునందుంచుకొని ప్రవర్తించవలసి యున్నది. ఆంధ్ర దేశము అనేక సీమలుగా పిలువబడుచున్నను భిన్నత్వములో ఏకత్వము పరమేశ్వరునిలో వున్నట్లు ఈ అన్ని సీమలలోనూ అంతర్గర్భితముగా ఒక ఐక్యభావము ఇమిడియున్నదని ప్రతియొక్కరు గుర్తించవలసియున్నది. ఆంధ్రవిశ్వ విద్యాలయము విషయములో జరిగిన విషయములు గూడ జ్ఞప్తియందుంచుకొని మరల తప్పటడుగులు వేయక ఐక్యతకు పునాదులు వేయవలసియున్నది. ఆంధ్రరాష్ట్రము విత్తసులో, అనుభవములో విద్యలో ఏరాష్ట్రమునకు వెనకబడలేదు. నేటి లెఖల అంచనాలు బట్టి స్వయంపోషకముగాడను వాదన అక్కడక్కడ వున్నప్పటికిన్నీ దేశములోని నిర్మాతలు చక్కగా ప్రవర్తించిన సౌష్ఠవమైన రాష్ట్రము ఏర్పడగలదు. కాని అప్పుడే విచ్ఛిన్నశక్తులు అటూ ఇటూ బయలు వెడలుచున్నవి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు రాయలసీమ వారి సుహృద్భావము ఎర్కారువారికిన్నీ, రాయలసీమ ఆర్థికాభ్యుదయమునకు సర్కారు వారి సుహృద్భావము రాయలసీమవారికి అత్యవసరముగా చేకూర్చుకొనవలసి యున్నది. రాయలసీమలేనిదే ఆంధ్రరాష్ట్రము లేదు. ఆంధ్రరాష్ట్రము రానిదే రాయలసీమ ఆర్థికముగా అభివృద్ధిచెందదనే నావాదన నేటికిన్నీ స్థిరము. రాయలసీమవారితో ఏర్పాటుచేసుకున్న శ్రీబాగ్ ఒడంబడికను జ్ఞప్తియందుంచుకొని ప్రతి ఆంధ్రుడును భావిభాగ్యతను, సౌఖ్యతను మనస్సునందుంచుకొని ప్రవర్తించుట అత్యావశ్యకము. దానికి ఆంధ్రదేశములోని నాయకులను, జిల్లాబోర్డు అధ్యక్షులు, మునిసిపలు అధ్యక్షులు మరితర ప్రముఖులను ఒకచోటచేర్చి ఒక సమాధానమునకు వచ్చుట అవసరము ఆ పనికి పూనుకొనుట ఆంధ్ర నాయకుల ధర్మము. రాయలసీమ పెదలు కూడ ఆంధ్రరాష్ట్రము మాకు అక్కరలేదను వాదమును విడనాడి అందరూ ఒకచోట చేరి సఖ్యతతో ఐకమత్యతలో మెలగవలసిన సమయము ఆసన్నమైనది. అందరు ఒక్క రాయలసీమ అభివృద్ధియే గాక భావి ఆంధ్రరాష్ట్రము యొక్క సౌష్ఠవమును సౌభాగ్యమునుగమనించి తీర్మానమునకు వచ్చుట అత్యావశ్యకము.

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు చేసిన సూచన అందరూ చదివియుందురు. కాని హైకోర్టు కంటె రాజధాని నగరము రాయలసీమలో వున్నచో మంచిదని కోరువారు కూడ వున్నారు. దీనినంతటినీ, ఇద మిత్థముగా నిశ్చయించుటకు వంట్లనే రాయలసీమ నాయకులు, ఆంధ్ర నాయకులు నేను పైన సూచించినట్లు పెద్దలందరూ సమావేశమై తీర్మానించుట అవసరము. హైకోర్టు వుండవలెనా, రాజధాని వుండవలెనా నిశ్చయించుభారము రాయలసీమవారిదేనని ఇంతవరకు ఒడంబడికలో సూచించబడెను. దీనినిబట్టి ఆంధ్రులెవరూ చీరాల, కాకినాడ, బందరులకు రాజధానిని నిశ్చయము చేయవలెనని కోరుట సమంజసము కాదు. సఖ్యతకు తోడ్పడదు.

అందున వెంటనే ఒక్క రాజధాని హైకోర్టు విషయమేగాక, విశ్వవిద్యాలయ ఉపసంఘమువారి సూచనప్రకారము ఏర్పడుచున్న విద్యాసంస్థలు, విజ్ఞాన సంస్థలు, రాష్ట్రము ఏర్పడినతరువాత యావత్తు రాష్ట్రము యొక్క అభివృద్ధికి కావలసిన ఇతరసంస్థలు ఏవిఏవి ఎచ్చటెచ్చట ఎప్పుడు నిర్ధారణగా నెలకొల్పవలసినదీ ఒక పథకము నిర్ణయించుకొనుట అత్యావశ్యకము. దానికై ఆంధ్ర రాష్ట్ర పెద్దలందరూ పూనుకొనవలెనని సూచించుచున్నాను. సభలో అన్నియు నిర్ధరించువరకు ఎవరికి వారు సూచనలు గాని సలహాలుగాని చేసి నేడు ఏర్పడిన ఐక్యతకు చేటు కలుగనివ్వవలదని ఎల్లరినీ కోరుచున్నాను. ఈ సభలు ఎంత జాగ్రత్తగా, ఎంత త్వరగా జరిపితే అంతమంచిదని నా అభిప్రాయము.

## యలమంచిలి తాలూకాలో ఆర్థిక మంత్రి పర్యటన

యలమంచిలి, డిసెంబర్ 15: మదరాసు ఆర్థికశాఖామంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు నిన్న మధ్యాహ్నం 12-30 గంటలకు అనకాపల్లి నుండి యలమంచిలివిచ్చేసిరి. వారితో జిల్లాకాంగ్రెసు అధ్యక్షులు పసుమర్తి వీరభద్రస్వామి ఎం. ఎల్. సి. కార్యదర్శి మిస్సుల సూర్యనారాయణమూర్తి, భూపతిరాజు సత్యనారాయణ రాజు, గడ్డం సన్యాసిరావు ఎమ్. ఎల్. ఎ గార్లుకూడ విచ్చేసిరి. వీరుఅనకాపల్లినుండి యలమంచిలి తాలూకాకు సంబంధించిన పెదపాడు, తిమ్మరాజుపేట, హరిపాలెం, కొండకర్ల ఆవ ఏరియా, నరసింగపల్లి మీదుగా నరసాపురం మొదలగు గ్రామముల వరదలవలన పంట నష్టము, మేటలు పెట్టబడిన భూములుచూచి యిచ్చటకు వచ్చిరి. భోజనానంతరము తాలూకా కచ్చేరి. ట్రెజరీచూచి, రివెన్యూ ఆఫీసర్లతో ముచ్చటించి 3 గంటలకు నారాయణపురం మీదుగా సోములింగపాలెం, కట్టుపాలెం, గోకివాడ, అనకట్టు, గండ్లు చూశారు. వరదలవలన యీ తాలూకాలో ప్రవహించు శారదా, వరహా, తాండవ నదులక్రింద మొత్తం 85 వేల యకరముల పంట నష్టమై 1750 యకరములు మెట్టపల్లపు భూములు యిసుక మేటపెట్టినవని రివెన్యూ అధికారులు విన్నవించిరి. 4 గంటలకు తాండవనదీ తీరమున నష్టపడిన పెదరామభద్రపురం వగైరా గ్రామములు చూచి రాత్రి గడ్డం సన్యాసిరావుగారి ఆతిథ్యము స్వీకరించి విశ్రాంతి గైకొనిరి. 15 తేదీ ఉదయం, విశాఖపట్నం గవర్నరు జనరల్ గారి రాక సందర్భమున సందర్శించుటకు పయనమై, వెడలిరి.

## కాంగ్రెసు అర్హ సభ్యులకు రశీదులు

### విడివిడిగాకాక, సంయుక్తంగా ఇవ్వవచ్చునని నిర్ణయం

విజయవాడ, డిసెంబరు 15: కాంగ్రెసు అర్హ సభ్యులకు విడివిడిగా ఒక్కొక్క రశీదు పత్రాన్ని యివ్వడానికి తగినంత సిబ్బంది లేకపోవటంచేత ఇబ్బందిగా ఉన్నదని చాలా కాంగ్రెసు, సంఘాలు తెలుపుతున్నవనీ, ఈ ఇబ్బందిని గ్రహిస్తూ ఇకమీదట ప్రతిసభ్యునికి విడిగా రశీదు పత్రంఇవ్వవలసిన అవసరం లేదనినిశ్చయింపబడినదనీ రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి క. ఓబులరెడ్డిగారు తెలియ జేస్తున్నారు.

కాని అర్హ సభ్యుల పత్రములను అందజేసే వ్యక్తికి సంయుక్తంగా ఒకే రశీదు యివ్వాలి. ఈ రశీదులో పత్రముల నందజేసిన వ్యక్తిపేరు, పత్రముల సంఖ్య, గ్రామం, తాలూకా లేక వార్డు, పట్టణం పేర్లు పేర్కొనబడాలి. పత్రములు సురక్షితంగా వుండటానికి, మరెవ్వరూ వాటిని తస్కరించకుండా వుండటానికి, వాటిని అందజేసే వ్యక్తి ప్రతిపత్రంపైన తన సంతకంపెట్టాలి. ఈ సంగతిని కాంగ్రెసు సంఘాలు జారీచేసే సంయుక్త రశీదులో పేర్కొనబడాలి.

అర్హ సభ్యులకు ప్రత్యేక రశీదు లివ్వటంలేదు కనుక, ప్రాథమిక పంచాయతీ ఎన్నికల అధికారులు ఎన్నికలకునిలిచే అభ్యర్థులను, అర్హ సభ్యతా రశీదులు తెమ్మని పట్టుబట్ట నక్కరలేదు. అయితే అభ్యర్థులు తాము సకాలంలో అర్హ సభ్యులుగా చేరామని దస్కతుతోసహా ఒక పత్రాన్ని ఎన్నిక అధికారులకివ్వాలి. ఈ పత్రాన్ని ఆమోదించి ఆ అధికారులు వారిని ప్రాథమిక పంచాయితీ ఎన్నికలకు ఇతర షరతులకు అభ్యంతరం లేకపోతే పోటీ చేయనివ్వాలి, అని ఓబులరెడ్డిగారు ప్రకటిస్తున్నారు.

## ఒంగోలు తాలూకా గ్రామాల్లో స్ఫోటకం

### 23 గురు మరణం

ఒంగోలు, డిశంబరు 15: కొన్ని మాసాలుగా ఒంగోలు తాలూకా గ్రామాలలో స్ఫోటకం విపరీతంగా వ్యాపించి యున్నది. మొత్తం గ్రామాలన్నిటిలోను యిప్పటికి 23 గురు మరణించారు.

కరవది, బీరంగుంట, చీమకుర్తి, దశరాజుపల్లె, గుడిమెళ్లపాడు, లక్ష్మీపురం గ్రామాలలోగూడ స్ఫోటకము ప్రజ్వరిల్లి యిప్పుడే తగ్గుముఖం పట్టింది. ఒంగోలు లేజి ఆరోగ్యశాఖవారు అత్యవసర చర్యలుగైకొని పరిస్థితి చక్కబరచుటకు ప్రయత్నిస్తున్నారు. (స్వ. వి.)

### ప్రదర్శనానికి బస్సులు

తేనాంపేటలో జరుగు అ. భా. ఖద్దరు స్వదేశీ ప్రదర్శనం కొరకు 18 తేదినుండి హైకోర్టువద్ద నుంచి ప్రత్యేకంగా బస్సులు ఏర్పాటు చేయబడెను. పైగా 11, 13, 23, 24, 25 నెంబరు బస్సులుకూడ ఎక్కువగ చేయబడును.

### కాంగ్రెసు శాసనసభ్యుల పార్టీ

పై పార్టీ సమావేశము 21 తే సమావేశమై, వ్యవసాయదారులవద్ద బలవంతంగా ప్రభుత్వం ఋణం పుచ్చుకునే మంత్రివర్గం సూచనగూర్చి చర్చించును.

### విడుదల

కృష్ణాజిల్లా కమ్యూనిస్టు అబ్దుల్ రహీమును నిర్బంధమునుండి మదరాసు ప్రభుత్వంవారు విడుదలచేసిరి.

### 3 నెలల బి. టి. ట్రెయినింగు

సెకండరీ గ్రేడుట్రెయినింగు అయిన తర్వాత బి. ఎ. డిగ్రీ పొందిన విద్యాశాఖ ఉద్యోగులకు 3 నెలలు ప్రత్యేక శిక్షణ యొసంగి, సైదాపేట టీచర్సు కాలేజి యందు పరీక్షచేసి సర్టిఫికేటు యిత్తురు. అది బి. టి. డిగ్రీకి సమంగానెంచి స్థానిక సంస్థలు ప్రయివేటు పాఠశాలలందు పనులివ్వవచ్చును. దరఖాస్తులు జనవరి 6 లోగా సైదాపేట కాలేజికి పంపవలెనని అధికారులు ప్రకటించుచున్నారు.

## పటేల్ నెహ్రూలవద్దకు సింధియా ఉద్యోగుల రాయబారం

బరంపురం, డిసెంబరు 16: విశాఖపట్నం నౌకానిర్మాణశాలలో సిబ్బంది తగ్గింపు ఆలోచనను ప్రతిఘటించటానికి భారతప్రధాని, ఉప ప్రధానులతో సంప్రదింపులు జరిపేనిమిత్తం ఉద్యోగుల సంఘంతరఫున, కార్మికుల తరఫున ఒక ప్రతినిధివర్గం ఢిల్లీకి బయలుదేరింది.

ఈ వర్గంలో గౌతు లచ్చన్న గారు, ఉద్యోగులసంఘ అధ్యక్షుడు సి. రామారావు, విశాఖజిల్లా భా. జా. ట్రే. యూ. కాం. కార్యదర్శి జి. ఎమ్. నరసింహా రావుగార్లున్నారు.

గుంటూరు జిల్లాబోర్డు ఉపాధ్యక్షుడుగా ఎన్నికైన మర్రెడ్డి గురవారెడ్డిగారు

## గుంటూరు జిల్లాబోర్డు ఉపాధ్యక్షుని పర్యటన

తూములూరు, డిసెంబరు 15: గుంటూరుజిల్లాబోర్డు ఉపాధ్యక్షులు మర్రెడ్డి గుర్వారెడ్డిగారు యీ నెల 12, 13 తేదీలందు, గుడిబండివారిపాలెం, దావులూరు, ఈమని, వల్లభాపురం, మున్నంగి గ్రామములందు పర్యటించి, స్థానికబోర్డు ప్రాథమిక పాఠశాలలను, వైద్యశాలలను పరీక్షించిరి. గుడిబండివారిపాలెంలో స్థానిక కాంగ్రెసువాదులు అల్పాహార విందొసంగిరి. 12 వ తేది రాత్రి లంకిరెడ్డి లక్ష్మారెడ్డిగారు విందొసంగిరి. 13 వ తేది ఉదయం మున్నంగివెళ్లి స్థానికపాఠశాలను, వైద్యశాలను పరీక్షించి బొంతు బసివిరెడ్డిగారింటివద్ద అల్పాహారవిందుగైకొని తెనాలి వెళ్లిరి.

## గుడివాడ చైర్మన్ గారిపై ఫిర్యాదులు

### విచారణకు ప్రత్యేకాధికారి నియామకం

విజయవాడ, డిసెంబరు 17: గుడివాడ పురపాలక సంఘాధ్యక్షునిపై చేయబడిన ఫిర్యాదులను, ఆయనపై విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ప్రతిపాదించటానికి రాష్ట్రకాంగ్రెసు అనుమతించవలెనని కొందరు సభ్యులు కోరిన కోరికను, పరిశీలించి దర్యాప్తుచేయటానికి ఈడుపుగంటి శివమూర్తిగారిని ప్రత్యేకాధికారిగా రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం నియమించింది.

గుడివాడ పురపాలక సంఘంలోని కాంగ్రెసు పార్టీని సమావేశంచేసి, పార్టీలో సామరస్య, సహకారం సాధించే మార్గాలనుచర్చించటానికి అవకాశం కల్పించాలనికూడా శివమూర్తిగారిని కార్యవర్గం కోరింది.

డిసెంబరు 20 వ తేదీన గుడివాడ ట్రావెలర్సు బంగళాలో దర్యాప్తు జరుగుతుందని కాంగ్రెసు కౌన్సిలర్లకందరికీ నోటీసులు జారీచేయబడినవి. స్వ. వి.

## వ్యవసాయకూలీలఅధీనంలోనున్న భూములను వారికే ఖాయపర్చాలి

### రేపల్లెతాలూకావ్యవసాయకూలీ కాంగ్రెస్‌విజ్ఞప్తి

నిజాంపట్నం, డిసెంబర్ 15: రేపల్లె తాలూకా వ్యవసాయ కూలీకాంగ్రెసు వార్షిక మహాసభ, నిజాంపట్నంలో గత సోమవారంనాడు గోగినేని లక్ష్మీనారాయణగారి అధ్యక్షతన జరిగింది.

గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షులు నల్లూరి రాజయ్య జిల్లా వ్యవసాయకూలీ కాంగ్రెసు ఉపాధ్యక్షులు టి.డి. జాకబ్, ఎ. శేషయ్య, కే. వీరాస్వామి, డా॥ కొవురాజులతోపాటు, షుమారు 1500 మంది రైతులు, వ్యవసాయకూలీలు, సభకు హాజరయినారు.

జి. రంగనాయకులుగారు సభను ప్రారంభిచారు.

అధ్యక్షులు ప్రసంగిస్తూ, గవర్నమెంటు పోరంబోకు, సత్రభూములు, అటవి ప్రదేశములు, నిరాశ్రయులైన ప్రతి వ్యవసాయకూలీ ఒక్కొక్కనికి 5 ఎకరాల చొప్పున యివ్వవలశినదిగా, రంగాగారు 1945 లో అందజేసిన ప్రణాళికననుసరించక, కూలీ కాంగ్రెసు సంఘాలు ఆందోళనను లక్ష్యపెట్టక, బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నందులకు ప్రభుత్వమును విమర్శించారు

పైగా బీదల స్వాధీనంలోనున్న భూములను, రాజకీయ బాధితుల కొసంగి కూలీల మధ్య, కాంగ్రెసు సేవకుల మధ్య విషబీజములు నాటుటకు కారకులు ప్రభుత్వమే అనుట విచార కరమన్నారు. సహకార పద్ధతులమీద ప్రతి కూలీకి 5 ఎకరాల భూమిని యిచ్చి, సరీన కూలీ వేతనమును నిర్ణయిస్తూ, తదనుగుణ్యంగా వ్యవసాయ పరికరములకు కనిష్ట ధరలు నిర్ణయించాలన్నారు.

కమ్యూనిస్టుల విష ప్రచారాన్ని అరికట్టుటకు, రైతు, కూలీ, మధ్య సహకార సద్భావము యేర్పడుటకు, కాంగ్రెస్‌కు, గ్రామీణ ప్రజల అండ వుండ గలందులకు, పై సూచనలు సహాయపడగల వన్నారు.

అనంతరం, నల్లూరి రాజయ్య రామరాజు, ఖాగరు సాహెబ్ మొదలగు వారు ఉపన్యశించారు.

నిజాం పట్నం 'మీదిలిపత్రు, 'తిప్పలమూల' ప్రాంతంలోని భూమిని సహకార పద్ధతులమీద పేద రైతు, కూలీలకు 5 ఎకరాల వంతున మంజూరు చేయవలసినదిగాను, ధాన్యం; పంచదార వగైరా కంట్రోళ్లను తొలగించవలశినదిగాను, ధాన్యం ధర కనీసం 16-4-0 అయినా ఖాయ పర్చవలశినదిగాను, వ్యవసాయ కూలీ, నిర్ణయించి, కూలీలకు ధాన్య రూపేణా చెల్లించుటకు అవకాశ మివ్వవలశినదిగాను, కోటా విధానాలలోని లోపములను సవరించ వలశినదిగాను ప్రభుత్వమును కోరుతూ తీర్మానించారు, కూలీల స్వాధీనములోనున్న భూములను వారికే ఖాయపర్చ వలశినదిగాను, రేపల్లె తాలూకాలోని పల్లెవారికి వలలు తయారు చేసుకోగలందులకు, ప్రత్యేక కోటాలమీద నూలు లభింప జేయవలశినదిగాను, నిర్బంధ అప్పుసేకరణ విధానమును ఉపసంహరించుకో వలశినదిగాను కూడ కోరారు.

అనంతరం, తాలూకా వ్యవసాయ కూలీ కాంగ్రెసు నూతన కార్యవర్గ ఎన్నికలు జరిగినవి.

చెన్ని అధ్యక్షులుగాను, శేషగిరి రాస్వామి కార్యదర్శిగాను యెన్నుకొబడినారు. టి. డి. జాకబ్ అభివందనములతో సభ ముగిసింది. స్వ. వి.

## 'నూతన భారత రాజ్యాంగంలో మైనారిటీవర్గాలకు రక్షణ ఉంది'

### నంద్యాలలో ఆహారశాఖమంత్రి రోష్ విక్టోరియా అభిభాషణ: పౌరసన్మానం

(స్వకీయ విలేఖరి)

నంద్యాల, డిసెంబరు 14: మద్రాసు ఆహారశాఖామంత్రి జే. యల్. పి రోష్ విక్టోరియాగారు కర్నూలు జిల్లాకలెక్టరగు పి. వి. చలపతి మొదలియార్, మత్స్యశాఖా డైరెక్టరు గారలతోను, నివర్తి వెంకటసుబ్బయ్య ఎం. ఎల్. ఏ కర్నూలుజిల్లా కాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శులతోను కలసి, నిన్నటి మధ్యాహ్నమున కర్నూలు నుండి యిచటికి వచ్చారు. పట్టణ కాంగ్రెసు ప్రముఖులగు కాదరబాద్ నరసింగరావు, గడ్డం సుబ్రహ్మణ్యం గుప్తగార్లను, పురపాలక సంఘాధ్యక్షులు దేశాయి కుప్పారావు గారును, యితర స్థానిక అధికార్లును మంత్రిగారికి స్వాగతమిచ్చారు. విక్టోరియా పఠనమందిరమునందు పట్టణ కాంగ్రెసు సంఘము వారు విందొసంగి రోష్‌విక్టోరియాగారిని గౌరవించిరి.

సాయంత్రమున స్థానిక హరిజనవాడను మంత్రిగారు దర్శించిరి. పిమ్మట యస్. పి. జి. హైస్కూలునందు, హెడ్ మాస్టరు జి. వి. అబ్రహాంగారొసంగిన అల్పాహారవిందున పాల్గొనిరి. హైస్కూలు ఆవరణమందు జాతీయ పతాకారోహణము గావించిన అనంతరము నివర్తి వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షతను జరిగిన సమావేశమున వుపన్యసించిరి. హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు, యితర సిబ్బంది, మంత్రివర్యులకు స్వాగతపత్రమును సమర్పించి, అందు భారత క్రైస్తవుల రాజకీయ హక్కులకై ఐక్యసంఘటన సూర్పటలో రోష్ విక్టోరియాగారు గావించిన కృషిని అభినందించిరి. రాష్ట్ర ప్రభుత్వము వారు మిషనరీ సంస్థల విద్యాభివృద్ధి కృషికి నిరోధమొనర్చవలదని కోరిరి. క్రైస్తవులుగా మతము మారినను, నిమ్న జాతుల ఆర్థిక దుస్థితి అభివృద్ధి బొందనేరదనియు, ఆ విషయములు ప్రస్తుత ప్రభుత్వము వారు గుర్తించి యితర నిమ్నజాతులతోబాటు క్రైస్తవ నిమ్నజాతుల అభ్యుదయమునకును సమానావకాశములతో తోడ్పడవలసినదిగాకూడ కోరిరి.

రోష్‌విక్టోరియాగారు సమాధానమొసంగుచూ స్వతంత్ర భారతావనిలో మానసికముగా మాత్రమేగాక శారీరకముగాకూడా విద్యార్థులు అభివృద్ధి జెందవలసియున్నదనియు, విద్యార్థులకు తగు ఆహారమును సమకూర్చుటకు ప్రభుత్వమువారు అన్ని విధముల యత్నించగలరనియు చెప్పారు. ఆహారపదార్థములను సరఫరా చేయుట మాత్రమేగాక, వాటి ఆహారశక్తిని అభివృద్ధి జేయుటనుగూర్చికూడ ఆలోచింపవలసియున్నదనిరి. యెట్టి మతవిభేదములకు అవకాశమొసంగక, క్రైస్తవులు యితర మతములవారితో సమముగా చూడబడగలరనియు, భావిభారత రాజ్యాంగమున మైనారిటీలహక్కులు కాపాడబడుననియు అనిరి. మైనారిటీల యిబ్బందులన్నియును క్రమక్రమంగా దొలగిపోగలవనిరి. ప్రత్యేక నియోజకవర్గములు వదలుకొనినందులకు క్రైస్తవులను అభినందించి అందులకు తగినట్లుగా మెజారిటీవర్గీయులు తమ వుదారతను ప్రదర్శించవలసియున్నదనిరి. భారత దేశమున క్రైస్తవ మిషనరీసంస్థలు గావించిన కృషిని అభినందించిరి. ఏ. దేవశిఖామణి గారి అంత్య వందనములతో ఆ సమావేశము ముగిసెను.

తదుపరి రోష్ విక్టోరియాగారు మునిసిపల్ హైస్కూలు ఆవరణలో నంద్యాల మునిసిపల్ కౌన్సిలువారొసంగిన స్వాగత పత్రమును స్వీకరించిరి. పురపాలక సంఘాధ్యక్షులు దేశాయి కుప్పారావుగారు స్వాగతపత్రమును చదివిరి. అందు యీ రాయలసీమ ప్రాంతము సస్యశ్యామలముగా కనుపించనప్పటికిని, అపారఖనిజసంపదతో కూడియుండినటువంటిదనియు, ఖనిజ పరిశ్రమలు అభివృద్ధిగాంచుచో, రాయలసీమ దారిద్ర్యము నైదొలగి, యితర మేటి ప్రాంతములతో సమముగా తులదూగగలదనియు వివరించిరి. రానున్న ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము ద్వారా తమ కోర్కెలన్నియు యీడేరగలవని ఆశించుచుంటి మనిరి. యుద్ధానంతరము పురపాలక సంఘ పరిపాలనా వ్యయము యెక్కువగా పెరిగిపోవుటచే పురాభివృద్ధి తగురీతి సాగింపలేకుంటిమనియు, విరాళము గాకున్నను, అప్పు రూపకముగానైనను స్థానిక సంస్థలకు ప్రభుత్వం తోడ్పడవలసినదని కోరిరి. విద్యుచ్ఛక్తి రోడ్ల అభివృద్ధి ప్రణాళికను యీపురమున త్వరలో అమలు చేయవలసినదని కూడ కోరిరి.

రోష్ విక్టోరియాగారు సమాధానమొసంగుచూ నంద్యాల పట్టణమున రోడ్ల పరిస్థితి బాగుగాలేదనియు ఒకవేళ ప్రభుత్వమువారు ఆర్థిక లోపముచే సహాయపడకున్నను, తమకు గల ఆదాయములోనే పట్టణములోని రోడ్లను మునిసిపాలిటీవారు అభివృద్ధి పర్చుటకు కృషి జేయవలసియున్నదనిరి పురాభివృద్ధికై నవీన అభివృద్ధి ప్రణాళికలను అమలు పరచుటకు ప్రయత్నించవలసినదనిరి. మన దేశమున మునిసిపాలిటీలు, తమ పరిమిత అభ్యుదయమునకై మాత్రమే కృషి జేయుట గాక, దేశపు మొత్తము అభివృద్ధికై కృషిజేయవలసియున్నదనిరి. పట్టణములు గ్రామములపై ఆధారపడియుండుటను మరువవలదనియు, పట్టణములకు ఆహారధాన్యము గ్రామ ప్రాంతములనుండియే రవాణా కావలసియున్నదనియు, గ్రామ ప్రాంత అభివృద్ధిని గూడా మనమున బూని, పట్టణ వాసులు పాటుపడవలసినదిగా కోరిరి.

యితర దేశములతో పోల్చి చూచిన మన దేశమున విద్యాభివృద్ధి అత్యల్పమనియు, నిరక్షరాస్యతను పోగొట్టి, విద్యాభివృద్ధి గూర్చుటతోబాటు, సాంఘిక జీవనాభివృద్ధిని గూడ గమనించవలసినదని కోరిరి. దేశ ఆర్థిక పరిస్థితులు త్వరలో అభివృద్ధిగల్గునని ఆశ వెలిబుచ్చిరి.

## కడప జిల్లా ఆహార సంఘ సమావేశం

కడప, డిసెంబరు 16: నిన్న సాయంకాలము కలెక్టరు ఆఫీసులో జరిగిన ఆహార సంఘ సమావేశంలో మాటలాడుచు మదరాసు ఆహారశాఖా మంత్రి రోష్ విక్టోరియాగారు రాగులు, జొన్నలు మొదలగు గట్టి ధాన్యములపై ప్రస్తుతమున్న నిర్బంధములను తొలగించి, పంపకము సులభము చేయవలయుననిరి జిల్లా కలెక్టరులను ఈ విషయమై రిపోర్టులు పంపవలసినదిగా చెప్పియున్నామనియు, వీటికి కంట్రోలు లేకుండచేయుట కష్టముకాదనియు కూడ చెప్పిరి. ప్రస్తుతము జిల్లాలో ఏయే ధాన్యములు ఎంతెంత ఉండునదియు, ఇటీవల వరదలవలన జిల్లాలో ఏయే ప్రాంతములలో ఎంతెంత నష్టము కలిగినదియు, వరద బాధితులకు ప్రభుత్వము చేసిన సహాయము మొదలగునవి అన్నియు వివరముగ జిల్లా కలెక్టరయిన బి. మాధవరావునాయుడుగారు తెలియజేసిరి.

శాసనసభా సభ్యులైన స్వర్ణానాగయ్యగారు కొన్ని చెడిపోయిన బియ్యము, జొన్నలు మంత్రిగారి బల్లపై పెట్టి "మా జిల్లాలో కావలసినంత మంచి జొన్నలున్నవి. మంచి వడ్లున్నవి. ఈ రేషనింగ్, కంట్రోళ్లవలన అవి సాధారణ ప్రజలకు అందుబాటులోలేదు. శ్రేష్ఠమైన ధాన్యమును వదలిపెట్టి మనుష్యులు తినజాలని, పుచ్చిపోయి, పురుగులుపట్టి, ముక్కిపోయిన గింజలను మాచే తినిపించుట భావ్యమా? ఇటువంటి ధాన్యమును తినుటచే ప్రజలు, అజీర్ణము భేదులు మొదలగు వ్యాధులచే బాధపడుచున్నారు. మాకు ఈ బియ్యము బదులు వడ్లు సప్లై చేసినచో చాల మేలు. గనుక మంత్రిగారు ఈ విషయమై తగిన చర్య తీసికొనగోరుచున్నాను" అని చెప్పిరి.

శాసనసభా సభ్యులైన క. కోటిరెడ్డిగారు మాటలాడుచు "కంట్రోళ్లవలన ఎవరికీ మేలులేదు. బ్లాక్‌మార్కెటు చేయువారు మాత్రము లాభపడుచున్నారు. రేషనింగ్ ప్రకారమిచ్చు 10 ఔన్సుల ధాన్యముతో ఏ ఒక వ్యక్తియు తృప్తిపడి యున్నాడని నమ్ముటకు వీలులేదు. ఆ కొద్ది ఆహారముతో ప్రాణము మాత్రముపోకుండ నిలుపుకొనవచ్చును. కాని ప్రతి రొకరు యేదో ఒక పనిచేయవలసియున్నదికదా. అందులో ముఖ్యముగ కాయకష్టముచేయువారి గతి ఏమి? మంత్రిగారు గట్టి ధాన్యములకు కంట్రోలు తొలగింతెదమని చెప్పినందుకు వారికి నా ధన్యవాదము లర్పించుచున్నా" ననిరి.

జిల్లా కోఆపరేటివ్ హోల్‌సేల్ స్టోర్సు అధ్యక్షులు పి. నారాయణరెడ్డిగారు చెడిపోయిన ధాన్యము సప్లైకి స్టోర్సు జవాబుదారు కానేరదనిరి. తాము ధన్యమును పండించువారము కాదనియు, ప్రభుత్వోద్యోగుల యాజమాన్యమున పంపబడు ధాన్యమును తెప్పించి వారి యుత్తరువుల మేరకు రేషన్ డిపోల ద్వారా ప్రజలకు సరఫరా చేయువారము మాత్రమేననిరి. ధాన్యమును దాచియుంచుటకు సరియైన వసతులు లేవనిరి. కడపలో చాలమంది ఇంతో అంతో భూమికలవారు కనుక చట్టసమ్మతమైన రేషనింగ్ అవసరము లేదనిరి.

మంత్రిగారు బదులుచెప్పుచూ జొన్నలు, రాగులు మొదలగువానిపై కంట్రోళ్లు తొలగింతెదమనియు, బియ్యముపై తొలగించుటకు వీలులేదనియు, ఉత్తరాంధ్ర జిల్లాలలో తుపానువలన మూడు లక్షల టన్నుల ధాన్యము నష్టముకలిగినదనియు, అందువల్ల పాత నిలవలో యుండిన బియ్యమును తీయవలసి వచ్చినదనియు, బియ్యము కాని లేక మరి యే యితర ధాన్యముకాని, బాగుగాలేనియెడల దానిని శుభ్రపరచి ఉపయోగించుకొనవలెననియు, అప్పటికిని ధాన్యము బాగుపడనిచో, అట్టిదానిని నిలవనుంచక రద్దు చేయుటకు జిల్లాకలెక్టరుగారికి అధికారమున్నదనియు చెప్పిరి. ప్రజలకు ఎవ్వరికిగాని చెడునాన్యము నుబలవంతముగా ఇచ్చు హక్కులేదు కూడ మంత్రిగారు చెప్పిరి.

## "వ్యాపారపు పంటలకన్న ఆహార ధాన్యాలు ఎక్కువ పండించాలి"

### భారత కిసాను కాంగ్రెస్‌లో రంగాగారి ఉద్ఘాటన

న్యూఢిల్లీ, డిసెంబరు 17: నేడిక్కడ భారత కిసాను కాంగ్రెసు సమావేశం ఆరంభమయింది. దీనికి దేశమంతటినుండి 100 మంది కిసాను ప్రతినిధులు హాజరైనారు. సమావేశం రెండు రోజులు జరుగుతుంది.

సమావేశానికి అధ్యక్షతవహించిన ఆచార్య రంగా ఉపన్యసిస్తూ, నెహ్రూ పిలుపు విని ఉత్పత్తి హెచ్చించని పక్షంలో నాలుగేళ్ళ కాలంలో దేశం దుర్భిక్షం పాలవుతుందన్నారు.

ఆయన ఇంకా ఇలాఅన్నారు: భారత కిసానులు వ్యాపారపుపంటలు తగ్గించి ఆహారధాన్యాలు హెచ్చుగా పండించాలి. దేశంలో నూటికి 70 మంది కిసానులు. మిగిలినవారు తిండికీ, బట్టకూ కిసానుపై ఆధారపడి ఉన్నారు. స్వాతంత్ర్యం లభ్యమైన తరుణంలోనే భారతకిసాను తమ జాతీయ నాయకులపిలుపు వినిపించుకోనట్టయితే, చైనాలో ఇప్పుడు జరుగుతున్నట్టుగా చాలా కష్టాలపాలై పోతారు.

పాడుపు విధానంగురించి రంగా ఈ విధంగా చెప్పారు:

రైతులు తమ గృహవ్యయాన్ని అన్ని విధాలా తగ్గించుకొని కష్టించికోర్చి ప్రతి దమ్మిడీ ఆదా చేయాలి. ఈ విధంగా నిలవ చేసిన ద్రవ్యాన్ని ప్రభుత్వానికి అర్పించి జాతీయ పరిశ్రమలు ఏర్పరచడానికి తోడ్పడాలి.

కాంగ్రెసు నాయకులు రైతును భూస్వాముల పిడికిలినుంచి విడిపించడానికి ఆసక్తులైఉన్నారు. మన రాష్ట్ర ప్రభుత్వాలు జమీందారీలను రద్దుచేస్తూ ఉన్నవి. జమీందారులకు మనచేత పరిహారం ఇప్పిస్తున్నమాట నిజమేకాని ఇది ఏమంత ఎక్కువ కాదు. ఈ చర్య అహింసాయుతంగా జరపాలంటే పరిహారం ఇవ్వవలసి ఉంటుంది.

కాంగ్రెసుచేత నియమించబడిన వ్యవసాయ సంస్కరణ సంఘంవారు చేసిన శిఫార్సులను గురించి రంగా ఈవిధంగా చెప్పారు:

పొలాలు సమీకరించడానికీ, ధాన్యం విక్రయంలో మధ్య వ్యాపారుల తీసివేయడానికీ రైతుసహకార సంఘాలు అభివృద్ధిచేయాలని పై సంఘంవారు శిఫార్సుచేశారు. వారి శిఫార్సులు ఆచరణలో పెట్టడం సాధ్యమయేలాగు కాంగ్రెసు మంత్రులు చూడాలి.

కొంత పొలానికి తగ్గిన భూవసతులు కలవారు నిర్బంధంగా సహకార సంఘాలలో చేర్చబడాలనే సూచన సరి అయినదికాదు ఇటువంటి నిర్బంధవిధానానికి లక్షలాది పేదరైతులు గురికాకుండా కిసాను కాంగ్రెసు చూడాలి,

కవులు దార్లు భూస్వాములుగా గుర్తించబడతారనే భయంతో అనేకచోట్లకవులు దార్లను పొలాలనుండి వెళ్ళగొడుతున్నట్టు వార్తలు వస్తున్నవి. అనేక సంవత్సరాలుగా పొలాలను చేస్తున్నవారిని వెళ్ళగొట్టడానికి వీలులేకుండా రాష్ట్ర ప్రభుత్వాలు శాసనాలు చేయాలి.

రైతులు సహకారసంస్థను ఏర్పాటు జేసుకొని, న్యాయమైన నాయకుల పోటీపై ఎన్నుకొని పక్షంలో వారికి భవిత్యం లేదు. నానాటికీ తీవ్రమౌతున్న ఆర్థిక సంఘర్షణకువారు బలి అయిపోగలరు.

రాజకీయ నాయకత్వాన్ని మనం కాంగ్రెసుకు వదిలి, రైతుల సాంఘిక ఆర్థిక సమస్యలను మనమే పరిష్కరించాలి.

# గ్రామ పంచాయతీ బిల్లుపై రాష్ట్ర శాసనసభ చర్చ

## విద్యాసంస్థల భవనాల స్వాధీనపు బిల్లుకు ఆమోదం

చెన్నపట్నం, డిసెంబరు 18: ఫలహారానంతరం అసెంబ్లీ నిన్న సమావేశమైనపుడు మజీద్ గారు విద్యాసంస్థల ఆస్తి స్వాధీనము బిల్లును ఎదిరించుచూ మాట్లాడిరి. ఈ బిల్లు సెలెక్టుకమిటీలో పరిశీలింపబడిన తరవాతకూడా లోపములు పోలేదనిరి. ప్రభుత్వమువారు రాష్ట్రంలో ప్రతివారికి విద్య వ్యాపింపచేయుటకు ప్రయత్నించుటకు మారుగా ప్రైవేటు వ్యక్తులుచేస్తున్న కృషికి యిట్టిబిల్లు మూలమున ప్రతిబంధకము కలుగజేయుట సబబుకాదనిరి. ప్రభుత్వము వారు బిల్లును ఉపసంహరించుకుంటే తమ ఉన్నతాశయాల క్షేమాత్రం భంగముకలుగజాలదనియు అచ్యుతల్ల మైనారిటీల కృతజ్ఞతను పొందవచ్చుననియు పలికిరి.

సామ్యూల్ గారు విద్యాసంస్థలు సక్రమముగా నిర్వహింపబడక సూచి వేసినట్టి సంస్థల సంఖ్య అతి స్వల్పమైయుండగా వాటిని ఉద్దేశించి విశేషాధికారములుండే యిట్టి బిల్లును శాసనముచేయ బూనుట న్యాయం కాదనిరి.

### మంత్రి జవాబు

మంత్రి మాధవమీనన్ గారు ఆవిమర్శలకు బదులుగా యిట్లనిరి. సెకండరీ ఎలిమెంటరీ పాఠశాలను రాష్ట్రములో చాలా వరకు స్థానికసంస్థలుఅన్నీ ప్రైవేటు సంస్థలచేతనే నిర్వహింపబడుచున్న దశ సంగతి ప్రభుత్వము అరసియున్నదనియు విద్యాభివృద్ధి కార్యమును భంగమొనర్చుటకు ప్రభుత్వము ఈ బిల్లువల్ల యత్నించుచున్నదని సభ్యులు చెప్పిన వాదనయే మాత్రం సబబుకాదనిరి. ఈబిల్లును పూర్వ విద్యామంత్రి దురుద్దేశ్యముతో తెచ్చినట్లు ఆరోపించుటకు మరింత భావ్యముగా లేదనిరి. ఈ బిల్లు మొదట శ్రీ కళా వెంకట్రావుగారు ప్రతిపాదించారనియు ఆమీదనే దానిని శ్రీ అవినాశి లింగంగారు నడిపిరనియు చెప్పిరి. ఈ చట్టంలో అల్పసంఖ్యాకులను అణచివేయ దలచితిమను వాదము కేవలము నిరాధారమయినది. నిరాడు రికగ్నిషను తొలగింపబడిన విద్యాసంస్థలు హిందూసంస్థలుగాని, క్రైస్తవులవి కావు.

పాఠశాలలను వశపరచుకొను అధికారం ఒక సంవత్సరంవరకే యివ్వబడింది. తీసుకున్నా నడిపించలేకుంటే, తిరిగి మొదటి సంస్థవారికే ఒప్పగించుటకు అంగీకరింతుము. కొందరు ప్రభుత్వ గ్రాంటులుకూడ పుచ్చుకొని పాఠశాలలను మూసి వేయుచున్నారు. అట్టివారు క్రైస్తవసంఘాలలోగాక యితరులలోనే ఎక్కువున్నారు, కనుక అట్టి పాఠశాలలు కొనసాగించుటకు యీ అధికారం వుండాలి. ఇందు అల్పసంఖ్యావర్గాల సమస్య లేనేలేదు. ఎవరియందు అనుమానంతో చేస్తున్న చట్టం కాదు. మతంతో సంబంధంలేదు.

"ఈచట్టమును సోషలిస్టు లేక కమ్యూనిస్టుల ప్రభుత్వం వచ్చినా దుర్వినియోగం చేయరన్నారు. వారు వస్తే యీ సభ అనుమతినే అడిగరని తెలుసుకోవలెను. సెలక్టు కమిటీలో ఎక్కువ మార్పులు జరుగలేదు. కనుక దీనిని సభవారు అంగీకరించవలెను" అని మాధవమీననగారు కోరిరి. ప్రతిపాదన అంగీకరించబడెను. 2-వ క్లాజులో ఎల్. సి. పాయిగారు సవరణ ప్రతిపాదించిరి. డి. ఇ. ఒ. పాఠశాల తీసుకోవాలని ఉత్తరవు చేయగానే, నిష్పాక్షిక విచారణకర్త విచారించాలని సవరణ కోరుచున్నది. మంత్రిగా రంగీకరించలేదు. కనుక నిరాకరించబడెను.

3-వ క్లాజులో రికగ్నిషను తొలగించిన 3 నెలలలో ప్రభుత్వంవారు తీసుకోవాలనిగాని, డి. ఇ. ఒ. ఉత్తరవుకాగానే అని వుండరాదని వేరొక సవరణను ఎల్. సి. పాయిగారు ప్రతిపాదించిరి. ముందుగ డి. ఇ. ఒ. ఉత్తరవు చేయును. దానిపై డైరక్టరకే దానిపై ప్రభుత్వానికి అపీలు చేయుటకు అవకాశ ముండాలనియు, దానికి 3 నెలలు అవకాశ ముండాలనియు సూచించిరి.

తీర్మానము నిరాకరించబడెను. పాయిగారు ప్రతిపాదించిన యితర సవరణలు కూడ నిరాకరించబడెను. పాఠశాలల యజమానులకు అద్దె యివ్వ నవసరంలేదని మంత్రిగారనిరి.

మంత్రిగారు చట్టము మూడవ ప్రతిపాదన గావించుచు, పయనుగారివలె కొందరువలె యీ చట్టము ఉపయోగించవలసి నవసరముండరాదనియే ప్రార్థించుచున్నాననిరి. పాఠశాలలన్నియు బాగుగ నిర్వహింపబడినచో దీనికుపయోగ ముండదనిరి.

రజాఖానుగారు, అవినాశిలింగం గారు దీనిని ప్రతిపాదించిన విషయం గనుకొంచుటచే అల్పసంఖ్యాక వర్గంవారికేగాక అధిక సంఖ్యాకవర్గములకు కూడ అనుమానం కలిగిందనియు, వారు చేసింది మంచిదే యని యిపుడు మాధవమీననుగారన్నా అవినాశిలింగంగారు యిపుడు మంత్రిగా లేకుంటుటవల్లనే నిజం తెలియగలదనియు,నుడివిరి.

పాఠశాలలు సరిగా నిర్వహింపబడకున్నచో తప్పక యీ చట్టం అమలు జరుగగలదని డి. వి. రామస్వామిగారనిరి. ఇస్మేలుగారు కూడ ప్రసంగించిన పిమ్మట మంత్రి మాధవమీననుగారు జవాబు చెపుతూ, పాఠశాల స్వంతదారు ఎక్కడున్నా దాన్ని నిర్వహించువాని వద్ద నుండి తీసుకొని, వాపసు యిచ్చునపుడు స్వంతదారుని వద్దకే యిచ్చెదమని చెప్పిరి.

చట్టం అంగీకరించబడెను.

### పంచాయతీల బిల్లు

గ్రామపంచాయతీలబిల్లు సెలక్టు కమిటీ నివేదకను మంత్రి చంద్రమౌళిగారు దాఖలుచేయుచు, కమిటీ 14 సమావేశములు జరిపి, నిపుణులను విచారించెనని తెలిపిరి. హరిజనులకు 10 సం॥ల వరకు స్థానములు ప్రత్యేకించుటయు, ఇనస్పెక్టరుకి ఇంజనీరింగు సిబ్బందిని నియమించే అధికారమిచ్చుట, వర్తక పంటలపై పన్ను వసూలు చేయుటకు, ఆస్తిమారకంపన్ను వసూలు చేయుటకు యితరపన్నులు విధించుటకు అధికారములు యిచ్చుచు కమిటీవారు కొన్ని మార్పులు చేసిరి. క్రొత్త పంచాయతీలు ఏర్పడేలోపున, జిల్లాబోర్డు ఆప్రాంతాల వ్యవహరించుటకు అధికారం ఒసంగబడెననియు తెలిపిరి.

హమీదుఖానుగారు, చర్చ ప్రారంభించుచు, పంచాయతీ గ్రామంలో ఓటరులంతా అధ్యక్షుని ఎన్నుకోవాలనే ఏర్పాటు మంచిదికాదనియు పంచాయతీ బోర్డు సభ్యులుమాత్రమే ఎన్నుకొన్నచో అధ్యక్షుడు బోర్డుకి జబాబుదారిగా నుండును. లేకున్న దాన్ని లక్ష్యపెట్టడనిరి. గ్రామాలలో పార్టీతగవులు యీ యేర్పాటువలన ఎక్కువగుననిరి. అల్ప సంఖ్యాకుల ప్రతినిధులను, ఎన్నుకోకుండా యధేచ్ఛగ చేర్చుకొని హరిజనులకు మాత్రం కొన్ని స్థానాలు ప్రత్యేకించుట రాజ్యాంగపరిషత్తు నిర్ణయం ప్రకారం జరిగిందన్నారు. ఈరాష్ట్రంలో పరిస్థితులు అందు కనుకూలంగా లేవు. కనుక యింకో లాగున నిర్ణయించవలసింది.

ఇబ్రహీంగారు చట్టానికి ప్రతికూలంగా మాట్లాడిరి. లోకలు బోర్డుల ఇనస్పెక్టరుకి సర్వాధికారము ఒసంగబడినదనియు, ప్రజలెన్నుకొన్న అధ్యక్షులకు కూడ అధికారాలు లేవనియు నుడివిరి.

అన్నాప్రగడ కామేశ్వరరావుగారు, యీచట్టం ద్వారా గ్రామీణులకు నిజంగా స్వరాజ్యం ఒసంగబడినదనియు, గ్రామమే రాజకీయాలకు శిక్షణ కేంద్రమయి, వయోజన ఓటింగు పద్ధతి జయప్రదంగా కొనసాగుటకు యిది తోడ్పడగలదనియు, చెప్పిరి. పంచాయతీబోర్డు అధ్యక్షుని గ్రామస్థులందరు ఎన్నుకోవాలన్న పద్ధతి చాల ముఖ్యమయినదని, గ్రామీణుల యీమన మంత్రి యీ చట్టమును సకాలమున తెచ్చెనని అభినందించిరి. తగవులకు కారణమయిన గ్రామమునసబు అధికారం దీనితో పడిపోవుననిరి. గ్రామమునసబుతోబాటు, కరణాన్ని కూడ బోర్డులో చేర్చుకోవాలి. లేకుంటే యిద్దరిని బోర్డులోనికి రానీయకూడదు. సోవియటు రష్యా పద్ధతిలో నుంది యీ చట్టము. గ్రామాలలో గుడిసెలకు పేదవారికి పన్నులు లేకుండా చేయాలి. గ్రామాలలో పన్నులకు ప్రభుత్వమే వసూలుచేసి కొంతభాగం గ్రామ పంచాయతీలకు యివ్వాలి. గ్రామాలలో పాఠశాలలను ఎక్కువ చేయాలని సూచించిరి.

గవర్నరు జనరలుగారి సభలున్నాయి కనుక సభ త్వరగ ముగించాలని అన్నాగారు సూచింపగ, మంత్రిగా రంగీకరించినందున సభ 4-40 గం. ముగిసెను.

### జమీందారీలలో చెర్వుల మరమ్మతు

#### అసెంబ్లీలో రివిన్యూ మంత్రి జవాబు

మదరాసు, డిసెంబరు 17: ఇటీవల ప్రభుత్వము విశాఖపట్నము కేంద్రముగా రివిన్యూ డిపార్టుమెంటు క్రిందనే ఇరిగేషను, విశాఖపట్నం జిల్లా, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలలోని మెట్టతాలూకా జమీందారీలలోని నీటివనరులను నిర్వహించుటకు ఒక ఎగ్జిక్యూటివు డివిజన్ మంజూరు చేసెనని రివిన్యూ మంత్రి శ్రీ సీతారామారెడ్డి గారు నేడు అసెంబ్లీలో తెలిపిరి.

రైతువారీ అయినా, జమీందారీ అయినా చెర్వుల మరమ్మతు స్కీము క్రిందికి వచ్చినా రాకపోయినా ఇటీవల తుపానువల్ల నదులకు కాల్వలకు పడిన గళ్ళను పూడ్చవలెనని కూడ వుత్తర్వు చేయబడినదని శ్రీ జి. వస్యాశీ రావు ప్రశ్నకు రివిన్యూమంత్రి జవాబు ఇచ్చిరి.

### చిత్రకళా ప్రదర్శనము

చెన్నపట్నం, డిసెంబరు 17: అఖిలభారత ఖాదీ స్వదేశీ పారిశ్రామిక ప్రదర్శనం ఆవరణలో చిత్రకళాశాఖ ప్రారంభోత్సవమును తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కామరాజ్ నాడార్ గారి వారి విదయను జరిపిరి. ప్రధానన్యాయమూర్తి శ్రీ రాజమన్నార్ గారు పుర ప్రముఖులు కొందరు సభ నలంకరించి యుండిరి. శ్రీ యస్. కే. వినాయకంగారు ఆహూతులకు స్వాగతమిచ్చుచూ నవకటి కాలములో జలయములు మన దేశపు కళావికాసమును ప్రదర్శించుచుండెననియు కళలకు ప్రోత్సహించుటానికి ప్రస్తుతకాలములో యిట్టి ప్రదర్శనములు అవసరమై యున్నవనియు నుడివిరి.

శ్రీ కామరాజ్ నాడార్ గారు కళాప్రదర్శనము ప్రారంభోత్సవము సలుపుచూ దేశముయొక్క నాగరకత కళలవల్ల వెల్లడియగునని వెనకటి కాలమున మహారాజులు కళారాధకులకు తమ ప్రోత్సాహమొసగి కళాభివృద్ధికి దోహద మొసగుచుండిరనియు, అయితే కొంతకాలముగా కళావిజృంభణకు సరియైన దోహదము లేక స్తంభించి యుండెననియు లలితకళలను మళ్ళీ ప్రజ్వలింపజేయుటకు యిట్టి ప్రదర్శనములు సహాయ్యకారిగా నుండుననియు యిటువంటి ప్రదర్శనము శాశ్వతముగా నొకచోట ఏర్పాటుచేయుటకు ప్రయత్నము చేయవలెం అవసరమనియు పలికిరి.

శ్రీ యస్. కె. శ్రీనివాసన్ గారి వందనార్పణముతో సభ అంతమయ్యెను. తరువాత సభాసదులు ప్రదర్శనములోని చిత్రపులను తిలకించిరి. ప్రదర్శనముతో ఈ ప్రదర్శించుటకై అందిన 1200 చిత్రములలో 800 చిత్రములను ఏర్చి ప్రదర్శించియున్నారు.

నీటిరంగుల చిత్తరువులు తైలవర్ణ చిత్రములు వాణిజ్య ప్రకటనలకు సంబంధించిన చిత్రములు, ఛాయా చిత్రములు పిల్లల కళావస్తువులు మున్నగునవి ప్రదర్శింపబడి యున్నవి.

### ఉద్యోగ వార్తలు

మదరాసు, డిసెంబరు 16: కేరళా సబ్బు ఫాక్టరీ ఆయిల్ టెక్నాలజిస్టు డా॥ కె. యస్. మూర్తి అనంతపురంలో ఆయిల్ టెక్నలాజికల్ ఇనస్టిట్యూట్ డైరెక్టరుగా నియమించబడిరి.

శ్రీ పి. యస్. రామకృష్ణన్ తాత్కాలికముగా సహకారసంస్థల డిప్యూటీ రిజిస్ట్రారుగా నియమించబడిరి.

లోకల్ ఫండ్ అకౌంట్సు అసిస్టెంటు ఎగ్జామినర్ శ్రీ యస్. వి. శర్మను గుంటూరునుండి తిరుచిరాపల్లికి బదిలీ చేసిరి.

శ్రీ వి. శ్రీనివాసన్ గుంటూరులో అసిస్టెంటు ఎగ్జామినర్ గ నియమించబడిరి.

### డ్రాయింగ్, కుట్టుపని నేర్పేవారి కొరత

బాలికా పాఠశాలలో కుట్టుపని, డ్రాయింగ్ నేర్పేవారి కొరత కొన్ని జిల్లాలలో వున్నదనీ, ఈ లోటును నివారించుటకు ప్రభుత్వము ఆలోచించుచున్నదనీ విద్యా మంత్రి నేడు అసెంబ్లీలో శ్రీగం అమీరుద్దీనకు తెలిపెను.

### పంచాయతీ బోర్డు క్రింది ఉపాధ్యాయులు

మదరాసు, డిసెంబరు 17: పంచాయతీలచే నిర్వహించబడే ఎలిమెంటరీ స్కూళ్ల టీచర్ల జీతము గురించి ప్రభుత్వము వుత్తర్వులు ఏమీ చేయలేదు. కాని నియమించబడే టీచర్ల అర్హతలను బట్టి పంచాయతీకి ప్రభుత్వము గ్రాంటులు చెల్లించును. పంచాయతీలు టీచర్లకు ఇచ్చే జీతముల వివరములు సిద్ధముగా లేవు. పంచాయతీ టీచర్లను ప్రావిడెంటు ఫండ్ స్కీములో చేర్చుకొను విషయము ఆలోచనలో వున్నదని విద్యా మంత్రి నేడు అసెంబ్లీలో శ్రీ వేదరత్నం కొళ్ళకు జవాబు ఇచ్చిరి.

### మాజీ కల్లుగీతవారికి వ్యవసాయ భూములు

వరి పండించుటకు భూమిని ఇప్పించవలసినదని పశ్చిమ గోదావరిజిల్లా, భీమవరం తాలూకా బలుసుమూడికల్లు తేబరు షాపుయజమానుండి దరఖాస్తు వచ్చినదనీ ఉప్పుటేరు రిజర్వుఫారెస్టుక్రింద వల్లపుసాగుకు జాయకయిన బ్లాకులు ప్రభుత్వ ఆలోచనలో వున్నవనీ అధికార్ల నివేదికలు సహజముగా పరిశీలన చదమనీ మద్యనిషేధ మంత్రి శ్రీ పంతులారెడ్డిగారు నేడు అసెంబ్లీలో శ్రీ కోసలరాం ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

### సరిహద్దు రాష్ట్రాభివృద్ధికి 3½ కోట్లు మంజూరు

#### పాకిస్థాన్ ప్రధాని ప్రకటన

పెషావర్, డిసెంబరు 17: పాకిస్థాన్ ప్రధాని లియాఖత్ అలీఖాన్ ప్రథమ పర్యాయం పాకిస్థాన్ రేడియో ద్వారా ప్రసంగిస్తూ, సరిహద్దురాష్ట్రాభివృద్ధికి 3½ కోట్ల రూ.లను పాకిస్థాన్ ప్రభుత్వం మంజూరు చేసినట్లు ప్రకటించాడు. ఈయన యిటీవల సరిహద్దు రాష్ట్రంలోను, కొంత జాతిప్రాంతాలలోను పర్యటన ముగించుకొనివచ్చాడు.

పాకిస్థాన్ పై వ్యతిరేక ప్రచారం ఎంత సాగుతున్నా, పాకిస్థాన్ పట్ల ప్రజల భక్తి విశ్వాసాలు లేమాత్రము సడలలేదని అన్నాడు.

శాంతము,శాంతిప్రియులైన ముస్లింలని, ప్రపంచంలో అన్ని దేశాలందు శాంతినే కోరుతున్నామని, ఎవరైనా తమపైనాడిచేస్తే, ఆదాడిని తిరుగగొట్టేటంత భారిగా పాకిస్థాన్ బలీయమైనదని లియాఖత్ అన్నాడు.

# తుపాను బాధితుల పట్ల మద్రాస్ గవర్నరు సానుభూతి

## గుంటూరుజిల్లా పర్యటన వివరాలు: జిల్లాక్షేమనిధి సంఘంతో ప్రసంగం

గుంటూరు, డిశంబరు 14: నేడు ఉదయం మద్రాసు గవర్నర్ జిల్లాకలెక్టర్ కనకసుందరం, జిల్లాపోలీసు సూపరింటెండెంటు కళ్యాణరావు, అంతరంగిక కార్యదర్శి గోవిందన్ నాయర్, మిలిటరీ కార్యదర్శి మేజర్ సి. యస్. రెడ్డిగారలతో తుపాను వలన నష్టపడిన తాడేపల్లి, మంగళగిరి, పెదవడ్లపూడి గ్రామములను సందర్శించిరి. తాడేపల్లి చేరగానే డిప్యూటీకలెక్టర్ డి. రామచంద్రరావునాయుడు గవర్నరుగారికి, తాడేపల్లి పంచాయితీబోర్డు అధ్యక్షుడు జి. మస్తాన్‌రెడ్డిని, తాసిల్దారు బి. వెంకటస్వామినాయుడును పరిచయము చేసిరి. ఊరికి ప్రక్కనే కొండలుండగా, గాలి ప్రమాదమెట్లు సంభవించినదని గవర్నర్‌గారు గ్రామీణుల ప్రశ్నించిరి. కొండలుండుటవలన గాలి సుడిచుట్టుకొని దెబ్బతీసినదని ఒకరు తెల్పిరి. గాలికి కూలిపోయిన ఇండ్లనెట్లు ఎంత కాలములో తిరిగి కట్టుకొనుచున్నారని గవర్నరుగారు ప్రశ్నింపగా, ప్రభుత్వమువారు వాసం బొంగులు, తాటిఆకులు ఇచ్చి కొంతవరకు సహాయము చేసిరనియు, గుడిసెలు రెండుమూడు రోజులలోనూ, పాకలు అయిదారు దినములలోనూ తిరిగి తయారు అయిపోయినవనియు ప్రజలు తెల్పిరి. అంత త్వరగా పనిచేసుకొనగలుగుట చాలా ఆనందదాయకముగా నున్నదని గవర్నర్‌గారనిరి. తాడేపల్లిలో గాలివానకు ఇద్దరు వ్యక్తులు మరణించిరి. వారి సంసారములకు ఒక్కొక్క సంసారమునకు రూ 50 ప్రభుత్వమువారిచ్చిరి. "పాపం! మనిషేపోగా, రూ 50కి ఏమివిలువ ఉండగలదు." తీరనినష్టము! అని గవర్నర్‌గారు సానుభూతి చూపిరి. తాడేపల్లిలో, పెట్టుపెర్లన్నియు దెబ్బతినినవి. పసుపు దాదాపు సగము నష్టపడెను. ఒక కూలీపెద్ద, తమకు సరిపడు రేషనులు దొరకుట లేదనియు, పదిమంది గల కుటుంబమునకు కూడా మూడుసేర్ల బియ్యమివ్వబడుచున్నవనియు, తుపాను తర్వాత తమకు ప్రభుత్వమువారు కొంత సహాయము చేసినప్పటికిని, తను దారిద్ర్యము తీరునట్లు లేదనియుచెప్పుకొనెను.

తరువాత గవర్నర్‌గారు గుడిసెలమధ్యకు పోయి, అనేకులను పరామర్శించిరి. గుడిసెలలో నివసించుచున్న నౌకర్లు, తాము కూడా తుపానువలన అధికంగా నష్టపడితిమనియు, కాని తమకు, అందరికి ఇచ్చినట్టుల ప్రభుత్వము ధనసహాయము చేయలేదనియు తెల్పిరి. రైల్వే నౌకర్లకు, సిమెంట్‌కంపెనీ నౌకర్లకు వారి వారి యజమానులే సహాయము చేయునట్లేర్పాటైనదని డిప్యూటీకలెక్టర్ తెలుపగా, రైల్వేవారు అప్పులనిచ్చిరేగాని, ధనసహాయమును చేయలేదని రైల్వే నౌకర్లు చెప్పిరి. తుపానుతర్వాత ఐదారు దినములపాటు ఉచితముగా, రైల్వే నౌకర్లకుకూడా రేషన్లు ఇవ్వబడినవని కలెక్టర్‌గారు తెల్పిరి. ఒక కూలిస్త్రీ, తమ డబ్బుతో బియ్యమును కొనుక్కొను వీలుకూడా లేకున్నదనియు, అర్ధాకలితో బ్రతుకుటకై సంపాదన అవసరమేమున్నదని సందేహము పుట్టుచున్నదనియు వ్యాఖ్యానించెను. ఈ బీదస్త్రీలు తమకు సరియైన ధరలకు వస్త్రములు లభించు ఏర్పాట్లు కావలెనని కూడా కోరిరి. గవర్నర్‌గారు అన్నియువిని, ఈ విషయములను అధికారులు గమనింపవలెనని చెప్పిరి.

### మంగళగిరి

అంత గవర్నర్‌గారు మంగళగిరికివెళ్లిరి. పంచాయతీబోర్డు అధ్యక్షుడు చింతకింది కనకయ్య, ఎక్జిక్యూటివ్ ఆఫీసర్ గోపాలకృష్ణమూర్తి, స్వాగతము తెల్పుచూ, మంగళగిరి ప్రజల కష్టనిష్ఠూర్యములను వివరించుచూ ఒక వినతిపత్రము సమర్పించుకొనిరి. గవర్నర్‌గారికి అనేకులు తమతమ యిబ్బందులను తుపాను నష్టములను విన్నవించుకొనిరి. అచటి బీదలు తమకు మంచినీటి బావి కావలెనని కోరిరి. పేదలు తుపాను తర్వాత తమకు ప్రభుత్వము కొంత సహాయము చేసినందుకు కృతజ్ఞత తెల్పిరి.

మంగళగిరి గ్రామ కాంగ్రెసువారు ఒకవినతిపత్రమును సమర్పించుచూ చేనేత వారికి చాలనష్టము సంభవించెననియూ, ఊరిమొత్తముమీద 900 ఇండ్లు కూలిపోయినవనియూ, స్థానిక కోపరేటివ్ స్టోర్సు ద్వారా కొన్ని అవసరములను తీర్చుచున్నామనియు తెల్పిరి. సహకార జీవనమును పెంపొందించుకొనుమని గవర్నర్‌గారు సలహానిచ్చిరి. అనంతరం గవర్నర్‌గారు శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయమును సందర్శించిరి.

### పెదవడ్లపూడి

పెదవడ్లపూడికి గవర్నర్‌గారు చేరగానే పంచాయితీబోర్డు అధ్యక్షుడు అన్నె కోటయ్య, అన్నె సంజీవయ్యగారలు వారిని పూలమాలాలంకృతులంజేసి, పసుపు, నారింజలకు చాలా నష్టము వాటిల్లినదని తెల్పిరి. రెండు పసుపు మొక్కలను తీసుకొనివచ్చి గవర్నర్‌గారికి చూపగా, వెంటనున్న వ్యవసాయ శాఖా డిప్యూటీ డైరెక్టర్ కె. వెంకటరామన్, ఆ పసుపుమొక్కల ఆకు ఎండిపోయియుండుటవలన పసుపుకొమ్ము బాగుగా పెరుగజాలదనియు, పైగా కొమ్ము కొంచెము చెదలుతగిలినట్లున్నదనియు, తెల్పిరి. మామూలుగా పండుపసుపు పంటలో, ఈ ఏడు సగముపంటమాత్రమే పండగలదని రైతులు చెప్పిరి.

### జిల్లా క్షేమనిధి సంఘం

పెదవడ్లపూడినుంచి గవర్నరుగారు సరాసరి గుంటూరులో కలెక్టరు ఆఫీసుకు వచ్చి, జిల్లా క్షేమనిధిసంఘంవారి సమావేశములో పాల్గొనిరి. కమిటీ అధ్యక్షులుపాములపాటి వెంకటకృష్ణయ్యగారు సభ్యులనందరనూ గవర్నరుగారికి పరిచయము చేసిరి. డా॥ సి. హనుమంతరావు, తెల్లాకుల జాలయ్య, కాసరనేని అంకినీడు, పాదర్తి రత్నం, సోమశేఖరరావు తలా ఒక 116/- రూ. నేషనల్ టొబాకో కంపెనీ వారు రూ 1901/- క్షేమనిధికి విరాళమిచ్చినట్లు ప్రకటింపబడెను.

నిధిసంఘ కార్యదర్శి డా॥ సి. హనుమంతరావు నివేదికను చదువుచూ, రాష్ట్ర కమిటీవారు తమకొక 'మెడికల్ వాన్'ను ప్రసాదింపవలెనని కోరిరి. జిల్లా కమిటీవారు త్వరలో అడివొప్పుల, ఎర్రగవపూడి, ఎస్వేరు గ్రామములలో వెల్ఫేర్ సెంటర్లను ప్రారంభింపనిశ్చయించిరి. నర్సులను, మంత్రసానులను తర్ఫీదు చేయుటకు ఒక శిక్షణాలయమును నెలకొల్ప, కమిటీవారాలోచించుచున్నట్లుల కార్యదర్శి తెల్పిరి.

సహకారనిర్మాణ పద్ధతులపై బీదలకు గృహములను నిర్మించి ఇవ్వవలెననియు, తెనాలి, ఒంగోలు, గుంటూరులలో ఇట్లు నిర్మింప నాలోచింప బడుచున్నదనియు మద్ది సుదర్శనంగారు చెప్పిరి.

గవర్నర్‌గారు ఇట్టి సేవా కార్యక్రమములలో, ప్రభుత్వము ప్రజలు అందరూ యెట్టి భేదాభిప్రాయములు లేక కలసిమెలసి పనిచేయవచ్చుననియు, దానధర్మబుద్ధిగలవారని సేవానురక్తులను ఈ సంఘములలో చేర్చుకొని, కార్యక్రమమునువిస్తృతము చేయవలెననియు సూచించిరి.

ఫండ్ కమిటీతరపున ఆర్. యం. సప్రూర్‌గారు గవర్నరుగారికి కృతజ్ఞత తెల్పిరి.

### చీకటిబజారు పన్లుచేయవద్దు

అనంతరం గవర్నర్‌గారికి, భావనగర్ జోద్పూరు మార్వాడీలుకలసి పుష్పమాలలు సమర్పించిరి వీరిలో అనేకులు నేతివర్తకులు, "మీరు నేతిలో వనస్పతి కలుపుచున్నారా?" అని గవర్నర్‌గారడిగిరి మార్వాడీలు "లేదు" అని అనగా, చీకటిబజారు పనులుచేయవద్దు. అని శ్రీకృష్ణకుమార్ సింహాజీ వారికి హెచ్చరించిరి.

ఉదయం మహారాణి శ్రీమతివిజయాబా శ్రీమతి రుక్మిణి ప్రభాకరరావుతో కలసి, మన్లర్ హాస్పిటల్, జనరల్ హాస్పిటల్, స్టాల్ గరల్స్ స్కూల్‌ను సందర్శించిరి.

### మాజీసైనికుల సహకార సంఘము

మధ్యాహ్నము గవర్నరుగారు మాజీసైనికుల సహకారసంఘమును సందర్శించిరి. సహకారసంఘముల డిప్యూటీ రిజిస్ట్రార్ టి. వి. రత్నం సహకారసంఘపు పనులను గవర్నరుగారికి చూపిరి. గవర్నర్‌గారు మాజీసైనికులను పరామర్శించి వారి కష్టనిష్ఠూర్యములను తెలిసికొనిరి.

### మహిళాసమాజం

మహారాణి శ్రీమతి విజయాబా, మహిళాసమాజములో, మ్యునిసిపాలిటీవారు నిర్మించి ఇచ్చిన లైబ్రరీహాలును ప్రారంభోత్సవం జరిపిరి. శ్రీమతిస్వయంపాకం శేషమ్మప్రార్థన చేసిన పిదపరి, సమాజస్థాపకురాలు పండు ముసలి అయిన శ్రీమతి రాయసం రత్తమ్మగారు గవర్నర్ సతికి పూలమాలను వైచిరి. శ్రీమతికొండాపార్వతీదేవి హిందీలో మహారాణికి సన్మానపత్రమును సమర్పించుచూ, ప్రసూతి, శిశుపోషణ సౌకర్యములు లేవని విచారమును వెలిబుచ్చి, నర్సుల శిక్షణకు ప్రభుత్వము ఏర్పాటులను చేయవలెనని కోరెను.

మహారాణిగారు సమాధానమిచ్చుచూ, ప్రభుత్వము డబ్బులేక చాలాచిక్కులు పడుచున్నది గానీ, మహిళాసంఘము వారు దాతల నాశ్రయింపవలెనని సలహానిచ్చిరి. పైగా ప్రతివారునూ, ప్రభుత్వం అది చేయలేదు ఇది చేయలేదు అనుచున్నారు. కాని ఇన్ని పనులు ఒక్కసారిగా ప్రభుత్వం ఎట్లు చేయగలదు? మెల్లమెల్లగా గాని అభివృద్ధి కార్యక్రమములు కొనసాగవు. ఈ విషయమును గుర్తుంచుకొని, ప్రజాహిత సంస్థలు వ్యక్తుల సహాయమును సంపాదించుకొనుచూ, ప్రజాసేవ చేయవలెను అనిరి.

ఈ కార్యక్రమముకు అనేకులు చుట్టుప్రక్కల గృహిణులు వచ్చిరి.

### శారదానికేతనము

అనంతరం గవర్నర్ సతి శారదా నికేతనమును దర్శించిరి. నేతి చలపతి, డా॥ పరమూరి పేరయ్య, ఉప్పుటూరి పున్నారావు, శ్రీమతి కొండా పార్వతీదేవిగారలు మహారాణిగారికి స్వాగతమిచ్చిరి. నేతిచలపతి, నికేతన సంస్థాపకులైన ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీమతి లక్ష్మీబాయమ్మగారలను, గవర్నర్ సతికి పరిచయముచేసి, సన్మానపత్రమును సమర్పించిరి. శారదా నికేతన విద్యార్థినులు శ్రావ్యముగా పాటలు పాడిరి. గవర్నర్‌సతికి శారదా నికేతన మంతయు, చలపతి, పార్వతీదేవిగారలు చూపించారు.

### కృష్ణాశ్రమము

గవర్నర్‌గారు శ్రీ కృష్ణాశ్రమమును సందర్శించి అక్కడ హరిజన విద్యార్థులు చేతివృత్తులను నేర్చుకొనుట పరిశీలించిరి. కమ్మరము, వడ్రంగము, సిమెంట్ పని — ధనార్జన కుపకరించు వృత్తులు నేర్పబడుచున్నవి. మద్ది సుదర్శనంగారు ఇంతకంటె పెద్ద ఆవరణ, ఎక్కువ వసతులు ఉన్నచో, ఇంకను అనేకమంది హరిజనబాలురకు శిక్షణ నివ్వగలనని తెల్పిరి. ఆశ్రమములో తయారు చేయబడిన ఒక పెట్టెరాట్నమును, సుదర్శనంగారు గవర్నరుగారికి బహుమానముగానిచ్చిరి. అవ్వారి హనుమయ్యగారు ఆశ్రమముతరపున గవర్నర్‌గారికి వందనము లర్పించిరి.

### జిల్లా మాజీసైనిక సంఘము

గుంటూరుజిల్లా సైలర్సు, సోల్జర్సు, ఎయిర్‌మెన్సు బోర్డువారు గవర్నర్‌గారికి అల్పాహార విందొసంగిరి. కార్యదర్శి కాప్టెన్ కె. వి. రాఘవయ్య చౌదరిగారు గవర్నరుగారికి సభ్యులను పరిచయము చేసిరి. మహారాజాగారు మాజీసైనికులను వారి సాధకబాధకల విషయమై ప్రశ్నించిరి. ఒక సైనికునికి చేయిపోయినది. కాని అతనికి నెలకు పాతికరూపాయలు పింఛను వచ్చుచున్నది. మరి ఒకనికి, పదేండ్ల సైనికజీవితము తర్వాత, ఈడు పెరిగి పోవుటవలన ప్రభుత్వోద్యోగము లభించుటలేదు. ఒక తల్లి - తనకొడుకు యుద్ధమునుండి శలవుపై వచ్చుచూనే తెనాలి ఆసుపత్రిలో మరణించెనని కాని ఇంతవరకు పింఛను లభించుటలేదని చెప్పుకొనెను. అతడు సైనిక ఆసుపత్రిలో మరణింపలేదట!

గవర్నర్‌గారికి, మేజర్ సి. యస్. రెడ్డి, అన్నియుఅనువాదముచేసి చెప్పెను. గవర్నరుగారు తామీ విషయములను మంత్రులతో చెప్పెదమని హామీనిచ్చిరి.

నేటిరాత్రి గవర్నర్ దంపతులు, పరివార సమేతముగా ప్రత్యేకరైలులో విశాఖపట్నంకు ప్రయాణమైవెళ్లిరి.

# చేనేత వస్త్రనిల్వల విడుదలకు ఏర్పాట్లు

## ఏలూరులో మద్రాసు చేనేత సహకారసంఘాల స్పెషల్ డెప్యూటీ రిజిస్ట్రారుగారి వివరణ

ఏలూరు, డిశంబరు 15: ప్రస్తుతం రాజధాని అంతటా, చేనేత సహకార సంఘాల వద్దను మద్రాసు రాష్ట్ర చేనేత సహకార సంఘపు డిపోలలోను విడుదలగాక పేరిగిపోయిన వస్త్రనిలవల విడుదలకు మార్గముల నేర్పాటు చేయుటకు, మద్రాసు చేనేత సహకార సంఘముల స్పెషల్ డిప్యూటీ రిజిస్ట్రారు జోసెఫ్ రెడ్డిగారు నిన్న ఇక్కడకు వచ్చారు. వారి క్రిందివిషయములు తెలియజేశారు.

ఇటీవల చేనేత వస్త్రముల ధరలుచాల వరకూ తగ్గిపోయినవి. అందువలన, మాసంఘములవద్ద ఉన్న బట్టల నిల్వలను పల్లెప్రాంతములకు పంపి, వాటిధరల తగ్గుదల విషయమై ప్రజలకు తెలియపర్చిన, వస్త్రం విడుదలకాగలదను అభిప్రాయముతో అట్టిప్రణాళికనములులో పెట్ట ప్రయత్నిస్తున్నాము. మొన్ననే ఈపద్ధతి ప్రకారము దెందులూరులో ప్రయత్నించగా, స్థానిక సర్వార్థసాధక సహకార సంఘంద్వారా 1 గంటలో రు 850 ఖరీదు గల వస్త్రం విడుదల చేయగల్గితిమి.

చేనేతవస్త్రముల ధరల తగ్గుదలకు కారణములలో సరకులు విడుదలగాక అధికముగా నిలవయుండిపోవుట యొకటైయున్నది. అదీగాక మిల్లువస్త్రములు విరివిగా దొరకుచుండుటవలనగూడ, వానిఖరీదులు, చేనేత వస్త్రము ఖరీదును తగ్గింపు జేసినది. చేనేతదార్లు తమసరకు నిల్వలు విడుదల కావలెననినచో, మార్కెటులో పోటీకి నిలబడేటట్లు తమ పరిశ్రమను సరిదిద్దుకొనవలసియున్నది. చేనేత దార్లలో, నిర్వ్యాపారతవల్ల ఆర్థిక దుస్థితి ఏర్పడిన ప్రదేశములలో ప్రభుత్వంవారికి సహాయము చేయుటకాతురతతో యున్నది. పశ్చిమ గోదావరి జిల్లాపరిస్థితులు గమనించి, అట్టి సహాయమవసరమని కన్పడిన, సేలం మొదలైన జిల్లాలలో అమలు పెట్టబడిన రిలీఫ్ స్కీమునంటిదే యిచటకూడ అమలు జరుపబడుతుంది.

ఇదిగాక, కేంద్రప్రభుత్వమువారు చేనేత పరిశ్రమకు సహాయం చేసేనిమిత్తం తమ వస్త్రావసరములలో మూడవవంతు, చేనేతవస్త్రములను కొనుటకు అంగీకరించారు. వారికవసరమైన మాదిరీల వివరములను తెప్పించి, వాని ప్రకారము నమూనాలు తయారుచేసి త్వరలో పంపుతున్నాము. ఈ విధముగానూ చేనేతవారికి కొంత సహాయము జరుగుచున్నది.' అని జోసెఫ్ రెడ్డిగారన్నారు.

వారీ ఉదయం ఏలూరు చేనేత సహకార సంఘమును దర్శించారు. ఏలూరు చేనేత సహకార సంఘము, వారు తాము తయారుచేసే వస్త్రములు, ఇతర ప్రాంతములలో తయారయ్యే వస్త్రములకన్న కొలదిగా ధర ఎక్కువైనా, వాటినాణ్యమునుబట్టి, ఎప్పటిబట్ట అప్పుడు విడుదల చేస్తున్నామనీ, గత సంవత్సరం ఉత్పత్తిచేసిన అరలక్ష రూపాయల ఖరీదుగల సరకు, గత సంవత్సరమే విడుదలచేసితిమనీ, రు 22000 ల నికర ఆదాయము సొసైటీ గడించినదనీ, నూలుకొరతగా ఉన్నది కాబట్టి, నూలు సప్లయి, చేయించవలెననీ కోరారు. (స్వ. వి.)

### ఆంధ్ర యూనివర్సిటీ సిండికేటు సమావేశం

విశాఖపట్నం, డిసెంబరు 14: గత శుక్రవారంనాడు జరిగిన ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సిండికేటు సమావేశములో డాక్టరు సూరి భగవంతంగారి, రాజీనామాను, సిండికేటువారు ఆమోదించారు. డాక్టరు భగవంతంగారు, హైదరాబాదు పరిశోధనాలయాల డైరెక్టరు పదవిని స్వీకరించుటవల్ల ఇక్కడి ఆచార్యపదవికి రాజీనామా ఇచ్చారు. రిజిస్ట్రారు కే. వి. గోపాలస్వామిగారికి రెండు మాసములు సెలవు ఒసంగబడింది. బాంకాకు పట్టణములో జరిగే యు. యన్. ఓ. మహాసభకు ఆయన హాజరగుటకు సదుపాయము కల్గిస్తూ యీ సెలవు యివ్వబడింది.

# ఖమ్మంమెట్టు తాలూకాలో కమ్యూనిస్టుల దౌర్జన్యచర్యలు

## ఇద్దరి హత్య: ఇండ్లదోపిడీ

ఖమ్మంమెట్టు, డిసెంబరు 16: ఈ తాలూకా గుదిమళ్ల గ్రామవాస్తవ్యుడు నామేరాం బాషా అనువానిని కమ్యూనిస్టులు హత్యచేసి అదే గ్రామానికి చెందిన లక్ష్మీనారాయణ, వెంకటయ్య అను వారి గృహములను దోచుకొన్నారని తెలియవచ్చింది.

ఇదే తాలూకా గోవిందపురం గ్రామంలో కమ్యూనిస్టులు ఒక ఇంటిని దహనపరిచారు. దహనమైపోయిన ఆస్తి దాదాపు 10 వేలుంటుందట. ఇదే తాలూకా కూచికట్టం గ్రామ వాస్తవ్యుడు కోమిని పుల్లయ్య అనువాడు కూడ కమ్యూనిస్టులచే హత్య చేయబడినాడని తెలియవచ్చింది.

### హైద్రాబాద్ టీచర్సు ట్రైనింగు కాలేజి

#### ప్రిన్సిపాలుగా ఆంధ్రుని నియామకం

హైద్రాబాద్, డిసెంబర్ 17: సుల్తాన్ బజారు హైస్కూలు ప్రధానోపాధ్యాయులు గాడేపల్లి సూర్యప్రకాశరావుగారు హైద్రాబాద్ ఉపాధ్యాయుల ట్రైనింగు కళాశాల ప్రిన్సిపాలుగ నియమించబడినారు. ఈ పదవి నిర్వహించే ప్రథమ హిందువు, ఆంధ్రులు కూడ సూర్యప్రకాశరావుగారే.

# 'ప్రాజెక్టుల కోసం అమెరికాను అప్పు అడిగేది లేదు'

## జాన్ మత్తయి వివరణ

న్యూఢిల్లీ, డిశంబర్ 15: దేశం ప్రాజెక్టులు కట్టడానికి భారత ప్రభుత్వం అమెరికా ప్రభుత్వం దగ్గర అప్పు తీసుకోవడం లేదు అని నేడు పార్లమెంటులో ఆర్థిక మంత్రి డా॥ జాన్‌మత్తాయ్ ప్రకటించారు.

శ్రీ లక్ష్మీనారాయణ సాహు వేసిన ప్రశ్నలకు సమాధానమిస్తూ భారత ప్రభుత్వం దేశాభివృద్ధి ప్రణాళికలను అమలు జరపడంకోసం ఇంటర్నేషనల్ బ్యాంకును అప్పు పెట్టవలసిందని అర్జీలు పంపిందని తెలియజేశారు.

డీన్ అచిసన్ అమెరికా దళిత దేశాలకు చేయగల సహాయాన్ని గూర్చి మాట్లాడుతూ ఈ సహాయం నిపుణులను పంపడం వరకు మాత్రమేనని అన్నారు గదా! అటువంటి సహాయంఇండియాకు చేయమనే అర్థం అందులో ఏమన్నా వుందా అని శ్రీ సాహు ఇంకో ప్రశ్న వేశారు.

అందులో అటువంటి అర్థమేమీ లేదని, డీన్ అచిసన్ చెప్పిన దాంట్లో నగదు సహాయం కూడా చేయగలమనే వున్నదని అది మార్షల్ సహాయం లాగా వుంటుందని డా॥ మత్తయ్ చెప్పారు.

అదీ కాకుండా పెట్టుబడి దార్లు, స్వంత వ్యాపారస్థులు ఒక దేశానికి నగదు సహాయం చేస్తామని అంటే, కాదనగలమని గూడా అచిసన్ అనలేదు అని ఆయన వెల్లడి చేశారు.

### హైద్రాబాద్ పోలీసు కమిషనరు కుమారుని వివాహం

హైద్రాబాద్, డిశంబరు 17: హైదరాబాద్ పోలీసుకమిషనరుసత్యనారాయణరెడ్డిగారి కుమారుడు రఘుపతిరెడ్డి వివాహం సందర్భంలో నిన్న సాయంకాలం సుఖనివాస్ రాముకోటివద్ద విందుఒసంగబడెను. దీనికి హైదరాబాద్ ప్రధానమంత్రి ఎం. కె. వెల్లోడీతో సహా అనేకమంది అధికార అనధికారప్రముఖులు హాజరయ్యారు. ఈ సందర్భంలో సుప్రసిద్ధ కూచిపూడి నాట్యాచార్యులు వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారి పుత్రుడు శర్మ, లలితల నృత్యకళా ప్రదర్శనము ఏర్పాటుచేయబడింది. వివాహం ఈ నెల 14 న జరిగింది. (స్వ. వి.)

### మేజర్ జనరల్ చౌదరీ

ఝాన్సీ, డిసెంబరు 17: మొన్నటి వరకు హైదరాబాద్ మిలిటరీ గవర్నరుగా నున్న మేజర్ జనరల్ చౌధరీ, ఝాన్సీలో ప్రథమ సాయుధ సేనాపతిగా పదవిని స్వీకరించారు.

### ఎం. శ్రీనివాసరావుగారు

హైదరాబాద్, డిసెంబరు 17: సంస్థాన వ్యవసాయ సంస్కరణల సంఘ కార్యదర్శి ఎం. శ్రీనివాసరావుగారు ప్రభుత్వ స్టాటిస్టిక్సు శాఖలో జనాభా లెక్కల డైరెక్టరుగా నియమించబడినారు.

# కొల్లేరు లంకగ్రామాల ప్రజల దుస్థితి: ప్రభుత్వ కర్తవ్యం

## తుపాను బాధితులకు సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీవారి వస్త్ర సహాయం

ఏలూరు, డిశంబరు 14: ఈ తాలూకా కొల్లేరుప్రాంతమందలి లంకగ్రామములలో తుపానుబాధితులగు పేదలకు వస్త్రదానము చేయునిమిత్తం మద్రాసు సర్వెంట్సు ఆఫ్ ఇండియా శాఖవారు స్వయముగాను, మద్రాసునందలి యితరసాంఘిక సేవాసంస్థలద్వారానూ, సుమారు 15 వందల వస్త్రములు (క్రొత్తవి, ఉపయోగింపదగిన ప్రాతవికలిపి) సేకరించి వానిని పంచిపెట్టు ఏర్పాట్లుచేయుచున్నారు. శాఖకార్యదర్శి ఎస్. వి. వెంకట్రామన్ ఈ సందర్భంలో ఇచటకు వచ్చి స్వయముగా గుడివాక లంకగ్రామములో పెద్దలకూ పిన్నలకూ సుమారు 150 దుస్తులు పంచిపెట్టిరి. మిగిలినవికూడా పంచిపెట్టు ఏర్పాట్లు చేయునిమిత్తం కె. ఎల్. ఎన్ రావుగారు ఇచటికివచ్చి లంకగ్రామములకు వెళ్ళిరి. ఎస్. వి. వెంకట్రామన్‌గారు కొల్లేటి లంకగ్రామములలో తమపర్యటన గురించి ఈ క్రిందివిషయములు తెల్పిరి.

తుపానుసంభవించి ఆరువారములైనా లంకగ్రామముల పరిస్థితి ఏమీచక్కబడలేదు. ముఖ్యముగా కొల్లేరుప్రాంతమంతా గవర్నమెంటువారి భూమియైయున్నది. ఈ భూమిలో అచ్చటచ్చట సంవత్సరము పొడుగునను నీరుండు ప్రదేశములు గలవు. ప్రస్తుతము కొంతమందిధనాఢ్యులు ఈ ప్రభుత్వమువారిభూమిని వందలకొలది ఎకరములు ఆక్రమించి, ఇంజన్లు పంపులు పెట్టి, లంకలలోని పేదలందరిచేత మొదటి పంటకూ, రెండవపంటకూ, తలాక రెండెకరముల చొ॥ సాగుచేయించి, తమ ఇంజన్లద్వారా నీరుసప్లయిచేయుచూ, పండినపంటలో నీటిసప్లయికని సగభాగమున్నూ, పెట్టుబడిసహాయముకింద మిగిలిన సగములో సగమున్నూ తీసుకొంటున్నారు. ఈ విధముగా సాగుచేసేది బీదలైనా ఏమి ప్రయోజనమును పొందగలుగుటలేదు. ప్రభుత్వము ఈ భూమిని బీదలకుహరిజనులకు పెద్దలకూ తలకొక రెండెకరములు శాశ్వత పట్టామీదయిప్పించి సహకారసంఘము ద్వారా సహాయముచేసినచో, తామే ఇంజన్లు పంపులుపెట్టుకొని సాగుచేసికొనెదమని వారు చెప్పిరి. అదీకాక గోదావరి కాలువనీటివలన సాగుకాగల ప్రాంతములో కూడ ప్రభుత్వంవారు రెండవపంటకు వీలు గలభూమిని రెండవపంట ఉన్న సంవత్సరము తాత్కాలికముగా బీదహరిజనులకు, పడ్డీలకూ తలకు రెండెకరముల చొ॥ సాగుచేసికొన నిచ్చుచున్నారు. ఈ సాగుకై ప్రతిసారి ఒకేభూమి ఒకే రైతుకు యివ్వకూడదని ఉత్తర్వులుండుబట్టి, ఏ రైతూ, తన రెండెకరములూ బాగుచేసికొని పండించుకొను ప్రయత్నము నేయ వీలులేకపోవుచున్నది. కాబట్టి అట్టిప్రాంతములలో గూడ భూమిని శాశ్వత పట్టాలమీద బీదలందరికీ చెరిరెండెకరములుగా యివ్వవలసినదిగా అక్కడిప్రజలు కోరిరి. ఈ విధముగా ప్రభుత్వము చేసినయెడల ఈ బీదలందరి ఆర్థికస్థితి చాలావరకు ప్రభుత్వము చక్కబర్చిన వారగుదురు."

### అ. భా. సంఘసేవా సమావేశం

#### హైద్రాబాదు తరపున ప్రతినిధులు

సికిందరాబాదు, డిశంబరు 16: హైదరాబాదు సాంఘిక సేవాశాఖ డైరెక్టరు అబ్దుల్ గఫూర్, డిప్యూటీ డైరెక్టరు సయ్యద్ ఖాజామహబూబ్ హుస్సేను ఈ నెల 26 నుండి 31 వరకూ ఢిల్లీలో రాజకుమారి అమృతకౌర్ అధ్యక్షతన జరుగనున్న అ. భా. సంఘసేవా సమావేశానికి ఈ సంస్థానం తరపున హాజరవుతారు.

ఈ సమావేశానికి సంస్థాన ప్రభుత్వం వెయ్యి రూపాయలు చందా ఇచ్చింది.

సంస్థానంలోని వివిధ జిల్లాలలో 7 లక్షలు దాకా ఆదిమవాసులున్నారనీ, వీరికి ఉచితంగా భూమిని, వ్యవసాయ పరికరాలను, మంచి ఇళ్ళను ఇతర సదుపాయాలను కలగజేసేందుకై ప్రభుత్వం ఎన్నో స్కీములను అమలుచేయాలని ఆలోచిస్తున్నదనీ డిప్యూటీ డైరెక్టర్ హుస్సేన్ నేడు యు. ప్రె. విలేఖరికి తెలిపారు.

### హైద్రాబాద్ ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షపదవి

#### కొండా వెంకటరంగారెడ్డిగారు ఎన్నికయ్యే సూచన

హైద్రాబాద్, డిశంబరు 17: హైద్రాబాద్ సంస్థాన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికల విషయంలో యిప్పటివరకు వచ్చిన వివరములనుబట్టి కొండా వెంకటరంగారెడ్డిగారు అధ్యక్షులుగా ఎన్నికైనట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. వెంకటరంగారెడ్డిగారికి 324 ఓట్లు, జమలాపురం కేశవరావుగారికి 288 ఓట్లు, కోదాటి నారాయణరావుగారికి 61 ఓట్లు, వేములపల్లి భాస్కరరావుగారికి 5 ఓట్లు వచ్చినట్లు తెలుస్తున్నది. కరీంనగర్ జిల్లాలో 186 ఓట్లున్నవి. వీటి వివరాలుమాత్రం యింకా రాలేదు. (స్వ. వి)

### అంతరరాష్ట్రీయ టేబిల్ టెన్నిస్ పోటీలు

సికిందరాబాదు, డిశంబరు 17: హైదరాబాదులో ఈ నెల 23 నుండి జనవరి 1 వరకూ సంస్థాన టేబిల్ టెన్నిస్ సంఘ ఆధ్వర్యాన 12 వ జాతీయ, అంతరరాష్ట్రీయ టేబిల్ టెన్నిసు ఛాంపియన్ పందెములు జరుగుతాయి.

బొంబాయి, మద్రాసు, బెంగాల్, మైసూరు, ఢిల్లీ, కొలంబో జట్లులు, దేశంలోని ప్రఖ్యాత ఆటగాళ్లు చందరానా, శివరామన్, ధండారి, కుమారఘోష్, మిస్ గర్దినర్, మిసెస్ సి. కె. కె. పిళ్ళె, మిసెస్ నాసిక్వాలా మొదలైనవారు పాల్గొంటారు.

# 'తుపాను బాధితులైన వ్యవసాయ కూలీలకు ప్రభుత్వంసహాయపడాలి'

## ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కూలి యూనియన్ కార్యవర్గ విజ్ఞప్తి

విజయవాడ, డిసెంబరు 16: ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయకూలీ యూనియన్ కార్యవర్గ సమావేశము మొన్న వేముల కూర్మయ్యగారి అధ్యక్షతక్రింద బెజవాడ గవర్నర్‌పేటలో కో ఆపరేటివు యూనియన్ ఆఫీసులో జరిగినది. సమావేశమునకు జి. వెంకటరెడ్డి, నరేంద్ర వెంకటసుబ్బయ్య, అక్కల చలమయ్య, దాసరి సంజీవరావు, పోతుల సున్నయ్య, వసల సూర్యనారాయణ, ముత్తంశెట్టి స్వామి, వి సుందర రామయ్య, నక్కా చిన వెంకయ్య, కొమ్మూరు ప్రసాదరావు, మోకా వీరయ్య, మాతంగి లక్ష్మయ్య, జాలాది జోసెఫుగార్లు, ప్రత్యేక ఆహ్వానముపై నంబూరు శ్రీనివాసరావు, అన్నవరపు ప్రసాదరావు, వరాలశెట్టి జాజిగార్లు, హాజరైరి. రాత్రి పన్నెండు గంటలవరకు సమావేశము జరిగినది. సభ్యులందరు యూనియన్‌ను బలపరచి పట్టుదలగా పనిచేయుటకు ప్రమాణములు చేసికొనిరి.

వరద తుపానుబాధితులైన వ్యవసాయ కూలీలకు ఇండ్లు తిరిగి నిర్మించుటకు వెంటనే ప్రభుత్వమువారు తగు సహాయము చేయవలయునని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

వరద తుపానుబాధితులైన కౌలుదార్లు పండిన పంటనుండి సగభాగము మాత్రమే భూస్వామికి చెల్లించునట్లు వెంటనే తగు ఏర్పాటులు చేయవలయునని కూడ కోరారు. కుమారప్ప కమిటీ నివేదికను అంగీకరిస్తూ, కాంగ్రెసు హైకమాండు కేంద్రప్రభుత్వము వెంటనే యీ రిపోర్టును అంగీకరించవలయునని కోరారు. వ్యవసాయకూలీల తరపున తుపాను వరద బాధితులకు, కౌలుదార్లకు అన్ని విషయములలో తగు సహాయము చేయుటకు ప్రభుత్వమువద్దకు ఒక రాయబారం పంపుటకు నిర్ణయించటమయినది. ఆంధ్రరాష్ట్రము జనవరి 26 నాటికే ఏర్పడుటకు తగు ఏర్పాట్లు చేయవలసిందని కోరుతూ ఒక తీర్మానంచేశారు.

ఆంధ్రదేశములో గల అన్ని జిల్లాలలోను, జిల్లా వ్యవసాయకూలీ యూనియన్‌లు, తాలూకా యూనియన్‌లు స్థాపించుటకు, చురుకుగా పని చేయుటకు వారికి కావలసిన ఆర్థిక సహాయమును చేయుటకు ఆర్గనైజింగు ఆర్థికసంఘంగా యీ క్రిందివారితో ఒక సంఘము నియమించటమయినది. వేముల కూర్మయ్య (అధ్యక్షులు), సుగ్గళ్ల చెట్టి (కార్యదర్శి) మంతెన వెంకట్రాజు, అల్లూరి సత్యనారాయణరాజు, నంబూరు శ్రీనివాసరావు. పశ్చిమగోదావరిజిల్లా కూలినాయకుడైన పోతుకోండ భద్రయ్యగారి మరణమునకు సంతాపం తెలియజేశారు

### వింధ్యప్రదేశ్ భవిష్యత్తు

న్యూఢిల్లీ, డిసెంబరు 17: వింధ్యప్రదేశ సంస్థాన యూనియన్ పాలకులు, నేడు రీవా సంస్థానంలో సమావేశమవుతున్నారు. వింధ్యప్రదేశ భవిష్యత్తు విషయమై నేటి సమావేశంలో తుదినిర్ణయం జరుగవచ్చునని తెలుస్తున్నది.

భారత ప్రభుత్వ సంస్థానశాఖా కార్యదర్శి వి. పి. మీనన్ యీ సమావేశానికి హాజరౌతున్నాడు.

వింధ్యప్రదేశంలో కెల్లా పెద్దదైన రీవా సంస్థానం యు. పి. లో విలీనం చేయబడుతుందని, మిగతా 33 సంస్థానాలు సి. పి. లో విలీనం చేయబడునని యీప్రతిపాదిత కార్యక్రమం నూతన రాజ్యాంగం అమలులోకి వచ్చే జనవరి 26 లోగా పూర్తికాబోతుందని తెలుస్తున్నది. నూతన రాజ్యాంగం క్రిందనైతే, యే సంస్థానాన్నైనా విలీనం చేయవలసివస్తే ముందుగా ప్రజామోదమును పొందవలసివుంటుంది.

### వ్యావసాయిక యంత్ర పరిశోధనకు అసఫాలీ బహుమానం

కటక్, డిసెంబరు 16: దున్నటం, విత్తులుచల్లటం, కలుపుతీయటం, కోత, నూర్పిడి యీ వ్యవసాయ కార్యక్రమాలలో, దేంట్లోనైనాసరే, సైకిలుసాయంతో తోలగలిగే మంచియంత్రానికి, [illegible] రూపాయల బహుమానమిస్తానని ఒరిస్సా గవర్నర్ అసఫాలీ ప్రకటించారు.

